Photo by N. Thyagarajan



బహుమతి
పొందిన వ్యాఖ్య

పట్టువడిన దిట్ట

పంపినవారు:
కె. ఎస్. గుప్త - అనకాపల్లి

## చందాదారులకు మనవి



పైనెల చందమామ యీనెల చివరి వారంలో పోస్టు అవుతవి. సకాలంలో అందనివారు, వారి పోస్టాఫీసులో ఏర్పాటు చేస్తూ, పై నెల పదోతేదీలోగా మాకు తెలియపర్చ గోరుతాము. ఆ పైబడువచ్చు కంప్లెయింట్లు. గతనెలలో చేతలేదనే కంప్లెయింట్లు గమనించబడవు.

మేనేజరు

# చందమామ

సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల 11-వ తేదీ శ్రీరామనవమి. ఇది మహత్తరమైన మన పర్వాలలో ఒకటి. ఈ సందర్భంలో అపూర్వములైన కొన్ని రామాయణ గాథలు, వినోదాలూ విశేషాలూ మీకు అందించటానికి కుతూహలపడుతున్నాము. ఇందులో— చిత్రమైన నడకలతో సాగిపోయిన 'ఋశ్యశృంగ కథ వ్రాసినవారెవరో తెలుసా ?—చందమామ పాఠకులకు లోగడ విందొనరించిన 'కవిబ్రహ్మ' ఏటుకూరి వేంకటనరసయ్యగారు. రామాయణమంతా చందమామకోసం ఇదేధోరణిలో గేయముగా వ్రాయాలనుకున్నారు ఆయన. ఐతే, విధివిలాసం వేరుగా ఉండి నాలుగేళ్ళ క్రిందటనే మన 'ఏటుకూరి' మనల వీడిపోయినారు. అందుచేత, చందమామ పాఠకులకూ—అంతే కాదు, విశాలాంధ్ర మంతటికీ—'ఏటుకూరి'వారి ప్రసిద్ధ గేయాలలో చివరకు మిగిలింది ఇదే!

సంపుటి 14 : ఏప్రిల్ 1954 : సంచిక 4



SANKAR

# ఋష్యశృంగ కథ



జాబిలి వెన్నెల గాస్తుంటె
చల్లని గాడుపు వీస్తుంటె
తాతా మనుమలు పందిటిలో
ప్రాత పురాణము విప్పారు.
తాతమాట లూకొడుతూ మనుమడు
రాతిబొమ్మలా గూర్చుంటే
చేతులు త్రిప్పుతు రామాయణ మా
తాతయ ప్రారంభించాడు.
కోసలదేశపు రాజులలో
గొప్పవాడు దశరథరాజు
అత డా దేశము పాలిస్తూ
అయోధ్యలో నుండేవాడు.

అతనికి కుడిభుజములలాగూ
అమాత్యు లెనమండ్రున్నారు
వారందఱిలో సుమంత్రుడే
పేరుప్రతిష్ఠలు గలవాడు.
తనకు వసిష్ఠుడు కులగురువై
ధర్మా లుపదేశిస్తుంటె
పది దిక్కులలో విహరిస్తూ
పరిపాలన చేస్తున్నాడు.
ఏడు దక్కనా లేలేవా
రాడంగులలా గొదిగారు
నాటి ధర్మ మొక మోస్తరుగా
నాల్గు పాదముల నడిచింది.
ఇంత వైభవము గలిగున్నా
సంతానము మాత్రము సున్నా
మువ్వలగువ్వలు పెండ్లాలూ
ముప్వురు గల రా భూపతికి
పట్టపురాణిని కౌసల్యన్
పరమ పూజ్యురా లంటారు
రవ్వలరాణిని కైకేయిన్
చివ్వల బెబ్బులి యంటారు.
సుమిత్ర యా యిరువురికన్నన్
చుఱుకుపాలు గలదంటారు
ఈ మూవురు బిడ్డలకొఱకై
నోమని నోములె లోవేయి.

'ఏ టు కూ రి'

దశరథుం డీ బెంగతోడ
దారి దెలియక
శాస్త్రపండితులను బిలిచి
సంప్రదించెను.
వారు మిన్నుమన్ను చూచి
నీరు నమలుతు
పుత్రకామేష్టి చేయ
బోధచేసిరి.
అపుడు రాజు ఋశ్యశృంగు
డను మహర్షిని
పిలువనంపి క్రతువు మొదలు
పెట్టుమనియెను.

మనుమడు:

అతగా డెవ్వడె తాతయ్యా!
కత కడ్డముగా వచ్చాడు?

తాత:

తొందరపడతా వెందులకోయ్
దొరబిడ్డల్లే వినరాదూ.

*　　*

రోమపాద నృపుడూ
భూమి నేలునపుడు
కొన్ని యేండ్లు వానా
కురవకుండ మానె
అంత రాజు వెఱచి
అయ్యవార్ల బిలిచి



శాంతి చేయజొచ్చె
క్షామమింక హెచ్చె
పిదప నృపతి జేరి
పెద్దలిట్టు లనిరి:
"అల విభాండకునకు
కలడు చిన్ని కొడుకు
అతడు పిన్ననాడె
అడవి కేగినాడు
ఈ విచిత్ర లోక
మ్మెఱుగ డింతదాక
అయ నెచట మెలగు
నచట కఱవు దొలగు
అతని బట్టి తెండు"



అమ్మయ్యో? ఓ రమ్మయ్యో?!
ఏమా శరీర సౌందర్యం!
ఆటలు పాటలు నేర్చిన వీ
యల్లరి చిల్లరి జంతువులు
పల్చని నారలు గట్టినవే
పట్టుకుచ్చులు చుట్టినవే
కమ్మని వాసన కొడుతుం దా
గాలి పీల్చితే బాగుండు
నున్నని జడ లెటు జారుతవో
వెన్నుకు గడితే బావుండు
పాడెండకు కసి గంతుతవే
నీడకు వస్తే బాగుండు
మూతులు ముక్కులు మోములు!నా
మో స్తరువైనా బావున్నై
మిలమిలలాడే మేనుల కే
మేత మేపితే సరిపడునో?
అంటూ వారలకడ కేగెన్
ఆ మూకలు పకపకలాడెన్.

* *

ముని:
అయ్యల్లో ఓరయ్యల్లో
అడవి మెకమ్ములు గావల్లో
నవ్వులు గురిసే పూవుల్లే
నాట్యమ్మాడే తీవల్లే

అనగ భూవరుండు—
చక్కటి కన్నెల బంపా డా
యోగిని గొని తెండన్నాడు
ఆ మూకలు తైతక్కంటూ
ఆ మహర్షికడ కేగినవి
గాలిపాటుగా నెన్నెన్నో
గమ్మత్తులు మొదలెట్టినవి

* *

అత్తరునూనెల గమగమకూ
ఆటల పాటల గుమగుమకు
ఆతడు గుమ్మయిపోయాడు
ఆఖరి కిట్లనుకొన్నాడు:

అదిగా దిదిగా దాటాడే
అమర మునీంద్రులు గావల్లె.
అనుచు వారి దెచ్చి
అతిథేయ మిచ్చి
వారు తనకు పెట్టు
పాలు, వెన్న, రొట్టె
లడ్డువములు మెక్కి
లాలనముల సొక్కి

ముని:

మా తపస్సుకన్న
మీ తపస్సె మిన్న
మీకు వీళులున్న
మాకు నేర్పుడన్న

కన్యలు:

రండు మా వసించు
చుండు చోటికంచు
వారు కదలుచుండ
వదలలే కతండు
వెంటనంటి రాగ
వనిత లెంతొ వేగ

*　　*

అంగభూమి చొచ్చి
రచటివారు మెచ్చి
రతడు కాలు పెట్టి
నంత నొక్క పెట్టు
కసరి కురిసె వాన
మసకపట్టె కోన
పులకరించె పుడమి
ముసలిగోవు పిదికె
మొగ్గ దొడిగె చిదుకు
రోమపాదు డంత
ప్రేమపుత్రి శాంత
నమ్మహర్షి కిచ్చె
నతని నితడు దెచ్చె
అర్థమైనదోయి ?
అవలి కథలు హాయి.






# రాజు చేసిన పని

విక్రమాదిత్యుడు గొప్ప పండితుడు, పండితపోషకుడు, దానకర్ణుడు అని పేరు పొందాడు. ఈ ఖ్యాతి దేశదేశాలకూ వెల్లడి అయింది. ఎక్కడో దూరాన వుండే మాతృగుప్తుడనే పండితుడు ఈ సంగతి విని రాజనగరు ఐన ఉజ్జయినికి వచ్చాడు.

ఒకనాడు రాజసభకు మాతృగుప్తుడు విచ్చేశాడు. పండితుడన్నవాడెవ్వడూ ప్రభువు ఎదుట చేతులు జోడించ నవసరం లేదనీ, స్వయంగా మహారాజే ఆ పండితుల యోగ్యతను గ్రహించి, తగిన సత్కారం చేసి పంపుతాడనీ మాతృగుప్తుడికి తెలుసు. ఈ కీలకం ఎరిగిన మాతృగుప్తుడు పోయి రాజును ఏమీ అర్థించలేదు. సభలో ఆసీనులై వున్న తక్కిన పండితులతోపాటయినా ఆయన కూర్చోలేదు. రాజు తనను ఎలా పరీక్షించి, తన శక్తిసామర్థ్యాలు తెలుసుకొంటాడా, అనేదే గుప్తునికి పట్టుకొన్న ఆలోచన.

ప్రభువు సభకు వచ్చాడు. మాతృగుప్తుని చూచాడు. చూచీచూడగానే 'ఇతడు కేవలమూ కవిమాత్రమే కాడు. గుణవంతుడుకూడా అని తోస్తుంది. ఇతనిలో మెచ్చతగిన గాంభీర్యం స్పష్టంగా ద్యోతకమవుతున్నది' అనుకొన్నాడు తనలో. అనుకొని, పండితుణ్ణి పరీక్షకు పెట్టాలని నిశ్చయించుకొన్నాడు. ఈ నిశ్చయంతో ఆతనికి ఆశ్రయం ఒక్కటే కల్పించాడు కాని, సత్కారమేమీ చేయలేదు.

మాతృగుప్తుడు రాజభవనంలో ఉంటూ, ప్రభువును ఎలా మెప్పించగలనా అనే సమస్యను గురించే తీవ్రంగా యోచింపసాగాడు. అతని వాలకం చూచి వీడెవడో పిచ్చిబ్రాహ్మడు అని అనుకోసాగారు భవనంలో అందరున్నూ.

విదూషకులు సభలో అతనిని పట్టుకొని పరిహాసం చేసేవారు. ద్వారపాలకులు ఈస

పి. అనంతం

ంచుకొనేవాళ్లు. ఐనా, ఇవేవీ లక్ష్యమూ చేయలేదు, పట్టించుకోనూ లేదు, మాతృగుప్తుడు. నిజానికి, అతని యోచనయేమిటో, ధోరణి ఏమిటో తప్ప, కన్నెత్తి చూసేవాడే కాదు. ఎవరితోనూ ప్రసంగించేవాడు కాదు. తన పాండిత్యం రాజుకు ఎలా వెల్లడించటమా అనే తాపత్రయంతో ఒక ఏడాదిపాటు గడిచిపోయింది.

ఒకరోజున విక్రమాదిత్యుడు బయలుదేరి అలా వెళుతూ ఉండగా, మాతృగుప్తుడు తారసపడ్డాడు. అతను బాగా చిక్కిపోయివున్నాడు. శరీరమంతా మలినంగా ఉంది. కట్టుబట్టలు మాసిపోయివున్నాయి.

'పరదేశి ఐన ఈ పండితుడు ఇక్కడ ఒక్కడూ నిస్సహాయ స్థితిలో ఉన్నాడని తెలిసీకూడా పాపం, ఒక నిండుసంవత్సరం పాటు అతనిని కష్టపెట్టాను. ఇక ఎంత మాత్రమూ ఆలస్యం చేయటం భావ్యంకాదు' అని తనలో అనుకొన్నాడు మహారాజు. ఐతే, ఇటువంటి గుణశీలుణ్ణి, ప్రజ్ఞావంతుణ్ణి ఏ విధంగా సత్కరించాలో ఆయనకు పాలుపోయింది కాదు.

* * *

అది శీతకాలం. దారుణమైన చలి. ఒకనాటి అర్ధరాత్రి వేళ మహారాజుకు




హఠాత్తుగా మెలకువ వచ్చింది. గదిలో దీపాలు వెలుగుతున్నాయి. వెచ్చదనం కలిగించటానికి నిప్పులతో కుంపట్లుకూడా గదిలో పెట్టినట్టు కనిపిస్తూనేవుంది. గది లోపలికి వీస్తున్న చలిగాలికి దీపాలు రెపరెపమని కొట్టుకొంటున్నాయి. 'ఎవడురా అక్కడ?' అని కేకవేశాడు ప్రభువు. బదులు లేదు. పహరావాళ్ళంతా మంచి నిద్రలో ఉన్నారు అప్పుడు.

'మహారాజా!—నేనున్నాను, మాతృగుప్తుణ్ణి...' అని కంఠస్వరం వినిపించింది. రాజు రమ్మన్నాడు. గుప్తుడు వెళుతూనే, ఆరిపోబోతున్న దీపాలు పెద్దవిగా చేశాడు.




చేసి, 'సెలవు ?' అన్నాడు. గుప్తుడు చలిచో గజగజ వణికిపోతున్నాడు. దానికి తోడు, మహారాజు ఈ సమయంలో ఎందుకు పిలి చాడో అని మరింతగా కంపించిపోతున్నాడు.

"రాత్రి ఇంకా ఎంత ప్రొద్దున్నది?" అని అడిగాడు రాజు.

"జామున్నర మాత్రమే వున్నది" అని బదులు చెప్పాడు గుప్తుడు.

"ప్రొద్దు సరీగా తెలుసుకోగలిగావే! రాత్రిళ్ళు అసలు నిద్ర పట్టటమేలేదా ?" అని మళ్ళీ ప్రశ్నించాడు మహారాజు.

ఇందుకు సమాధానంగా మాతృగుప్తుడు, అప్పటి కప్పుడు ఒక చక్కటి శ్లోకం అల్లి రాజుకు వినికిడి చేశాడు. ఆ శ్లోకానికి భావం ఏమి టంటే—

'మహారాజా !— విచారసాగరంలో మునిగివున్నాను. చలిగాలి గజగజ వణికి స్తూంది. కప్పుకొనేందుకు బట్ట లేక, అగ్నిని ప్రజ్వలించి కూర్చున్నాను. కాని, నా దుర దృష్టంకొద్దీ అది ఆరిపోతున్నది. ఊదలేక పెదిమెలు ఎండిపోతున్నయి. ఆకలిదప్పి కలవల్ల గొంతు ఎండిపోయి, దవడలు లోపలికి పీక్కొనిపోయినై. నాపై అభిమానం కొద్దీ నిద్రాదేవి నన్ను విడిచిపోయిందేకాని, నిశాదేవిమాత్రం అలానే నిశ్చలంగా వుంది.'

ఇది విని ప్రభువు, గుప్తుని పాండిత్యాన్ని ఎంతగా మెచ్చుకున్నాడో చెప్పనలవికాదు. తన ఊరు వెళ్ళిపోవటానికి గుప్తునికి అను మతి ఇచ్చాడు రాజు. ఐతే, వెళ్ళబోయే ముందు ఒకసారి తనను దర్బారులో కలుసుకోమని ఉత్తరువు చేశాడు.

మాతృగుప్తుడు, రాజుతో మాటాడి వచ్చి నందుకు తన దురదృష్టాన్ని నిందించుకో సాగాడు. 'నా నిస్సహాయస్థితిని తెలుసుకొనీ కూడా, తొలగించేటందుకు ప్రభువు ఏమీ చేసినట్టు లేదు. ఇంకా ఏంచేస్తాడో అని ఆశ పెట్టుకోవటం వృథా. ఇక్కడికి ఒక సంవత్సరమాయె, ధైర్యం చిక్కబట్టుకోవటం

జరిగింది. ఆశలన్నీ ఉడిగినై' అనుకొని, ఆ మరునాడు ఉదయమే విక్రమాదిత్యుని ఆశ్రయం వదిలిపోవాలని గుప్తుడు తీర్మానించుకొన్నాడు. మరునాడు ఉదయాన—

నిరాశతో, కృంగిపోయిన ఆ పండితుడు ఉదాసీనంగా వచ్చి ప్రభువుకు సమస్కరించాడు. ప్రభువు అతని సమస్కారం అందుకొని, ఆజ్ఞాపత్రాలు లిఖించే ఉద్యోగికి సంజ్ఞచేశాడు. ఆ అధికారి మూసిన ఒక పత్రాన్ని పట్టుకవచ్చి మాతృగుప్తునికి సమర్పించాడు. "కవీశ్వరా!–శ్రమ అనుకొనక, మీరీ ఆజ్ఞాపత్రాన్ని తీసుకువెళ్ళి, కాశ్మీరదేశపు ప్రధానమంత్రిచేతికి ఇవ్వాలి. ఇది చాలా రహస్యమైన పత్రం. ఎవరి చేతిలోనూ పడకుండా కాపాడుకొంటూ పోయి, దీనిని ముఖ్యమంత్రికి అందజేయాలి. జాగర్తసుమండీ! ఇది మహారాజావారి ఆజ్ఞ" అనిచెప్పి పత్రం చేతికిచ్చాడు.

గుప్తుడు సెలవుతీసుకొని, పత్రం చేత పట్టుకొని బయలుదేరాడు. ఇప్పు డాయనకు మనస్సులో బాధ మరీ ఎక్కువయింది. రాజును ఆశ్రయించినందుకు ఫలితంగా ఎటువంటి ప్రోత్సాహమూ లేకపోగా, తనను ఉత్తరాలు చేరవేసే సేవకునిగా వినియోగించటం ఆయనకు తీరని మనస్తాపాన్ని




కలిగించింది. పైగా దారిబత్తెము కూడా ఏమీ ఇవ్వకపోయె! ఇటువంటి పరాభవం జరిగినందుకు మాతృగుప్తుడు రాజునూ, రాజోద్యోగులనూ నిందింపసాగాడు.

* * *

ఎలా అయితేనేం, అష్టకష్టాలూ పడి మాతృగుప్తుడు కాశ్మీరరాజ్యపు సరిహద్దులలో 'కాంబూర్' అనే గ్రామం చేరుకొన్నాడు. ఊరివెలుపల ఒక డేరా కంటబడింది. అక్కడ కాశ్మీరరాజ్య మంత్రులందరూ విడిదిచేసి, ఎవరికోసమో ఎదురు చూస్తున్నట్టు తెలిసింది. పండితుడు బట్టలు మార్చుకొని, కాస్త శుభ్రంగా కనబడటానికి

తగిన పాట్లుపడి, ఆజ్ఞాపత్రం చేతపట్టుకొని కాశ్మీర మంత్రులకు సమర్పించటానికని సిద్ధంగా వున్నాడు.

విక్రమాదిత్యులవారివద్దనుంచి దూత వచ్చినట్టు తెలియగానే, ద్వారపాలకులు వెంటనే పోయి మంత్రులకు మనవిచేశారు.

నలువైపులనుంచీ మంత్రి సామంతులందరూ మాతృగుప్తునికి ఎదురువచ్చారు. బహువిధాల స్తుతించి, సమస్తమైన గౌరవ మర్యాదులతో ఉచితాసనంపైన ఆయనను అధిష్ఠింప జేశారు.

ఈ ఆదరమూ అభిమానమూ ఏమిటో గుప్తునికి అర్థం కాలేదు. దరిద్రుడైన కవి సిగ్గుతో క్రుంగిపోసాగాడు.

అప్పుడు మాతృగుప్తునికి అతివైభవంగా అభిషేకం చేయించారు. సుగంధ ద్రవ్యాలు పూశారు. నవరత్న ఖచితమైన అలంకారాలతో సింహాసనంపైన కూర్చోబెట్టి గొప్ప శోభతో పట్టంకట్టారు. పట్టాభిషేక సమయాన, ముఖ్యమంత్రి పండితుణ్ణి ఉద్దేశించి సభలో ఇలా చెప్పాడు : "ప్రభూ! మా కాశ్మీరరాజ్యానికి తగిన ప్రభువు కావాలని మేము మహారాజులుంగారిని కోరివున్నాము. వారు తమరిని మాకు ఏలికగా నియోగించారు. ఇకనుండి తామే మాకు అధిపతులు!"

మాతృగుప్తుడికి ఇదంతా కల గన్నట్టు అనిపించింది. విక్రమాదిత్యునికి గల సాటిలేని ప్రజ్ఞ, ఔదార్యమూ గుర్తుకు తెచ్చుకొని ఆయన తన్మయుడయ్యాడు. ప్రభువు పట్ల తనకు గల కృతజ్ఞత వెలిబుచ్చుతూ ఒక చక్కటి శ్లోకం రచించి పంపాడు.

గుప్తుడు రాజైనప్పటినుంచీ జనసమ్మతంగా పరిపాలించాడు. అంతేకాదు కవులనూ పండితులనూ సత్కరించటంలో గుప్తదానాలనే చేసి విక్రమాదిత్యుని అనుకరింపసాగాడు.





# రామనవమి

లోకకంటకుడై, లంకాద్వీపాన్ని పాలించే రావణుడు ఒకనాడు తన పట్టమహిషి ఐన మండోదరితో బయలుదేరి పులస్త్యుణ్ణి చూడడానికి వెళ్ళాడు.

కొడుకూ కోడలూ వచ్చేవేళకి పులస్త్యుల వారు పురాణం చదువుకొంటున్నారు. అది చూచి రావణుడు, 'ఏమిటండీ, ఈ గాథ ?' అని అయనను అడిగాడు.

'ఇది రామాయణం. దీనిని వాల్మీకి అనే మహర్షి రచించాడు. చిత్రమేమిటంటే ఇందులో చెప్పబడిన కథ అంతా యిది వరలో జరిగినది గాక, ఇకముందు జరగబోతున్నది ' అన్నారు పులస్త్యులవారు.

'ఆ జరుగబోయే వింత కథ ఏమిటో కాస్త మాకు సెలవిస్తారా ?' అని ఆయనను కోరాడు రావణుడు.

'శ్రీ మహావిష్ణువు భూలోకంలో దశరథుడనే రాజుకు కొడుకై పుట్టి, యుద్ధంలో రావణుడనే వాణ్ణి సంహరిస్తారట ' అన్నారు పులస్త్యులవారు.

యాథాలాపంగా వింటూఉన్న మండోదరి ఉలిక్కిపడి, ఎంతో ఆదుర్దాగా, 'రావణుడంటున్నారు, ఆ రావణుడు మీరు కాదు గదా కొంపతీసి ?' అన్నది భర్తతో.

అందుకు పులస్త్యులవారు, 'లోకంలో ఇద్దరు రావణులు లేరుసుమా. రావణుడంటే మనవాడేను ' అన్నారు.

ఈ మాట వినటంతోనే మండోదరీదేవి తన భర్తకు రాబోయే ఆపదను తలుచుకొని దుఃఖించటం మొదలెట్టింది.

రావణుడు నవ్వుతూ, 'దశరథుడంటే ఎవడో మనుష్యుడై వుంటాడు. మనుష్యులను జంతికలకుమల్లే కరకర నమిలి మింగే రాక్షసకులాని కంతటికీ రాజును నేను ! నన్నా, ఆ దశరథుని కుమారుడు చంపటం ? ఈ పుక్కిటి పురాణం నమ్మకు'

పాలంకి వెంకటరామచంద్రమూర్తి



అన్నాడు. ఈ మాటకు పులస్త్యులవారు, 'అలాగ తోసి పారెయ్యకు. ఇది పుక్కిటి పురాణం ఎంతమాత్రం కాదు' అన్నారు.

'అయితే ఒక పని చేస్తాను' అన్నాడు రావణుడు.

'ఏమిటి ?' అంది మండోదరి.

'ఆ దశరథుడనేవాడు ఈపాటికి ఎక్కడో పుట్టేఉంటాడు. వాణ్ణి పట్టుకు చంపివేస్తే, ఇంక వాడికి కొడుకు పుట్టడం, ఆ కొడుకు నన్ను చంపటం అనేది ఉండదుకదా' అన్నాడు రావణుడు.

అని వెంటనే తండ్రివద్ద సెలవు తీసుకొని అతడు భార్యతో లంకకు తిరిగి వెళ్ళిపోయాడు. చారులను రప్పించి, 'దశరథుడనేవాడెవడో, వానికి పెళ్లి అయినట్టయితే ఆ భార్య ఎవరో, వెంటనే తెలుసుకు రండి' అని చెప్పి పంపాడు.

కొంతకాలమయేసరికి ఆ చారులు తిరిగి వచ్చి, "ప్రభూ, హేమపట్టణాన్ని హరసేనుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతడు కోసలదేశపు రాజునూ, కేకయదేశపు రాజునూ ఓడించాడు. కోసలదేశపు రాజునకు కౌసల్యా అనీ, కేకయదేశపు రాజునకు కైకేయి అనీ కుమార్తెలు ఉన్నారు. హరసేనుడు ఆ బాలికలను హేమపట్టణానికి తెచ్చి భార్య కిచ్చి, 'ఈ పిల్లలను మన అమ్మాయి సుమిత్రతోబాటు పెంచు. ఈ ముగ్గురికీ మంచి సంబంధాలు చూసి పెళ్ళిళ్ళు చేదాం' అన్నాడు" అని చెప్పారు.

అప్పుడు రావణుడు, 'నేను దశరథుని సంగతి కనుక్కరండర్రా అని పంపిస్తే మీరు హేమపట్టణం సొద చెప్పుకొస్తున్నారేమిటి ?' అని విసుక్కున్నాడు.

అందుకు చారులు, "ప్రభూ, చిత్తగించండి. ఆ బాలికలు ముగ్గురిలోనూ పెద్దదైన కౌసల్యకు మొట్టమొదట పెళ్లికుమారుణ్ణి వెతికితెచ్చారు. అతడే దశరథుడు" అన్నారు.

'ఐతే ఎప్పుడు పెళ్లి ?' అన్నాడు రావణుడు.



అందుకు వాళ్ళు 'జైమిని అనే మహర్షి వచ్చి ఈమధ్యనే ముహూర్తంపెట్టి వెళ్లాడని అనుకొంటున్నారు ప్రభూ! ఇదిగాక మరొక్క చిత్రంకూడా విన్నాము...' అన్నారు.

'ఏమిటది?' అన్నాడు రావణుడు.

"సుమిత్రకూ, కైకేయికీకూడా సంబంధాలు చూడబోతూవుంటే ఆ పిల్లలిద్దరూ 'మేము ముగ్గురం కలసి మెలసి పెరిగాము. మమ్మల్నికూడా ఆ దశరథుడికే ఇచ్చి పెళ్లిచేస్తే ముగ్గురం ఒకచోటనే ఉంటాం' అన్నారట. అందువల్ల సుమిత్రనూ కైకేయినీకూడా ఆ దశరథునికే ఇచ్చి పెళ్ళి చేస్తారట!" అని చెప్పారు.

'ఈ పెళ్ళి కాకుండా చూడాలి' అంటూ రావణుడు కొలువు చాలించి లేచి, వెంటనే హేమపురాధీశ్వరుడైన హరసేనునిపైకి దండెత్తి వెళ్ళాడు.

ఆ రాజును యుద్ధంలో ఓడించి పారదోలి, రావణుడు విజయగర్వంతో అంతఃపురం ప్రవేశించి ఆ రాజకుమార్తెలను ముగ్గురినీ తెచ్చి రథంమీద కూర్చోబెట్టుకున్నాడు. ఇంక ఆ దశరథుని పని పట్టాలనే ఉద్దేశంతో రథాన్ని దశరథుని పట్టణమైన అయోధ్యానగరంవైపు పోనిచ్చాడు. దారిలో గంగానది అడ్డు వచ్చింది. ఆ



నది ఒడ్డున ఒక సుందరమైన ఓడ కనబడింది. 'ఎవరిదీ ఈ ఓడ?' అని అడిగేసరికి ఆ ఓడవాళ్లు, 'హరసేనమహారాజులుంగారిది. వారికి కాబోయే అల్లుడైన దశరథుడు పెళ్ళికి తరలివచ్చినప్పుడు దాటించడంకోసం ఈ ఓడను మా రాజావారు పంపించారండి' అన్నారు.

ఈ మాట వినేసరికి రావణునికి ఒక ఆలోచన తోచింది. 'ఈ మానవుణ్ణి చంపటంకోసం నేను పని కట్టుకుని ఆ అయోధ్యదాకా వెళ్ళటం అనవసరం. ఆ బక్కవాని ప్రాణాలు తీయటానికి నా సేవకులే చాలు' అని అనుకొని, రావణుడు





మాయావులైన కొందరు రాక్షసులను రప్పించి వాళ్లతో, 'మీరు ఈ ఓడవాళ్ళనందరినీ చంపి భక్షించండి. నావికుల రూపాలు ధరించి హరసేనుని నావికులకు మల్లే నటిస్తూ, దశరథుణ్ణి ఓడపైకి రమ్మని పిలవండి. వానితో ఓడ సరీగా నదిమధ్యకు రావడంతోనే దాన్ని బుడుంగుమని ముంచివెయ్యండి!' అని ఆజ్ఞాపించాడు.

రావణుడు రాజకుమార్తెలతో లంకాపట్టణం చేరుకోడంతోనే మండోదరి వాళ్లను చూసి, 'ఎవరీ పిల్లలు?' అంది. రావణుడు సంగతంతా చెప్పి, 'దశరథునికి జలగండం ఏర్పాటుచేసి వచ్చాను. వాడికి నేడో రేపో గంగానదీమధ్యంలో పెద్దపెళ్లి ఐపోతుంది! అదే ముహూర్తానికి ఈ చక్కని చుక్కలను నేను పెళ్లిచేసుకుంటాను!' అన్నాడు.

మండోదరి నెత్తీ నోరూ బాదుకుంటూ, 'నీకూ నీ కులానికీ మారకులైన కుమారులను కనబోయే ఈ రాజకుమార్తెలనా పెండ్లి చేసుకుంటాననంటున్నావు? కొరివితో తల గోక్కోవటమా?' అన్నది.

కొంచెం ఆలోచించుకొన్న మీదట రావణుడు పెళ్ళిప్రయత్నం మానివేశాడు.

తరువాత పెద్ద మాను పెట్టె ఒకటి తెప్పించి దానిలో ఆ ముగ్గురు రాజకుమార్తెలనూ పెట్టి, మూసివెయ్యమన్నాడు. ఐతే, ఆ పెట్టెను దాచడం ఎలాగ అని సమస్య రాగా, రావణునికి వికర్ణుడనే మాయరాక్షసుడు జ్ఞాపకం వచ్చాడు. వికర్ణుడంటే, వేదాలను ఎత్తుకపోయి బ్రహ్మదేవుణ్ణి యేడిపించిన సోమకాసురుని కొడుకు అన్నమాట. ఈ సోమకాసురుణ్ణి చంపటానికే శ్రీమహావిష్ణువు అంతకుముందు మత్స్యావతారం ఎత్తవలసి వచ్చిందికూడా.

వికర్ణుడు రావడంతోనే రావణుడు ఆ పెట్టెను చూపించి, 'దీనిని తీసుకుపోయి భద్రంగా దాచు. నేను అడిగినప్పుడు మళ్ళీ తెచ్చి ఇద్దువుగాని' అన్నాడు.





వికర్ణుడు, 'చిత్తం ప్రభూ!' అంటూ ఆ పెట్టెను పుచ్చుకొని రావణుడు చూస్తూండగానే దానిని తన కడుపులో దాచేసి, 'ఇంక దీని సంగతి ఎవరికీ తెలియదుగా!' అంటూ ఒకమారు వెకిలిగా నవ్వి, తన నివాసస్థానమైన సముద్రానికి వెళ్ళిపోయాడు.

అంతలో అక్కడ—దశరథుడు పెండ్లికొడుకై తరలిరావడం, గంగఒడ్డున ఓడను ఎక్కడం, రావణుని ఆజ్ఞానుసారం ఆ మాయరాక్షసులు నట్టేట ఓడను ముంచి వెయ్యటం జరిగింది.

కాని ఆయుర్దాయమున్నవాళ్లు నట్టేట మునిగినా చావరు. దశరథుడు ప్రవాహవేగంతో సముద్రంలోకి కొట్టుకుపోయి, కెరటపు దెబ్బలకు మునుగుతూ తేలుతూ, ఒకచోట విఘ్నేశ్వరుని కంటబడ్డాడు.

ఏదో పనిమీద అప్పుడు విఘ్నేశ్వరుడు సముద్రంలో ఉన్న వరుణలోకానికి వెళ్ళి, కైలాసానికి తిరిగివస్తున్నాడు. కొనవూపిరితో వున్న దశరథుణ్ణి గట్టుకు చేర్చి వానిపొట్టను నొక్కి, తాగిన నీరంతా బయటకు పోయేటట్టు చేశాడు. దానితో దశరథుడు బ్రతికి బయటపడి, పెండ్లికని వెడుతూవుంటే తనకు మృత్యువు ఎదురైన సంగతి చెప్పాడు. అప్పుడు విఘ్నేశ్వరుడు మీనమేషాలు లెక్కచూసి, 'జైమిని పెట్టిన ముహూర్తం ఇంకొక్క అరఘడియలో అసన్నమౌతుంది. ఆ ముహూర్తానికి తప్పక నీకు వివాహం అయేతీరుతుంది' అన్నాడు.

ఆయన అలా అంటూవుండగానే అక్కడికొక పెట్టె కొట్టుకువచ్చింది. ఆ పెట్టెను తెరిచిచూసేసరికి దశరథుని పెండ్లికుమార్తెలైన ఆ ముగ్గురు రాజకుమార్తెలూ కనపడ్డారు. 'చూశావా, నా జ్యోతిషం యెలా నిజమైందో మరి!' అంటూ విఘ్నేశ్వరుడు ఆ ముహూర్తానికే దశరథునకూ, ఆ రాజకుమార్తెలకూ మంత్రయుక్తంగా వివాహం జరిపించాడు. తరువాత వాయుదేవుని

సహాయంతో వారిని అయోధ్యకు చేర్చి, తను కైలాసం చేరుకున్నాడు.

సముద్రమధ్యంలో జరిగిన ఆ వివాహాన్ని రెండు తిమింగిలాలు చూసినై. మొగతిమింగిలం ఆడతిమింగిలంతో, 'రావణాసురుడు ఎంత ప్రయత్నించినా ఈ పెళ్ళి ఆపలేకపోయాడు, చూశావా? బ్రహ్మ రాతకు తిరుగు లేదు' అంది.

'ఐతే ఈ మానుపెట్టె ఎక్కడిది?' అన్నది ఆడతిమింగిలం.

'అది వికర్ణుని పొట్టలోనించి వచ్చింది. రావణునిముందు మెప్పుదలకోసం వాడు దానిని తన కడుపులోనే దాచేశాడు. ఇందుకే దారుణమైన శూలపోటు బయలుదేరి, పెట్టె బయటపడితేగాని నిలవలేకపోయాడు. తరువాత వాడికి కునుకు పట్టింది. వాడు ఇంకా నిద్రపోతూనే ఉండగా ఈపెట్టె ఇలా కొట్టుకొచ్చింది' అన్నది మగతిమింగలం.

'అయ్యో పాపం. రావణుని కీ సంగతి తెలిస్తే వికర్ణుణ్ణి చంపేస్తాడు కదా!' అంది మళ్ళీ ఆడతిమింగిలం.

'వికర్ణుడు చస్తే సముద్రానికే పీడ వదులుతుంది! ఆ దుర్మార్గునికోసం మనం జాలిపడనక్కరలేదు. కాని, రావణున కీ సంగతి తెలవనేతెలవదు. దశరథుడు చని పోయాడనీ, రాకుమార్తెలు ఇంకా వికర్ణుని కడుపులోనే ఉన్నారని అనుకుని, కొంత కాలానికి రాక్షసేశ్వరుడు ఈ ఉబుసే పూర్తిగా మరచిపోతాడు.

'ఈ రాకుమార్తెలలో జ్యేష్ఠురాలైన కౌసల్య గర్భాన మహావిష్ణువు శ్రీరాముడై అవతరించి, లోకకంటకుడైన రావణుణ్ణి వధించబోతాడు' అని చెప్పింది, మగ తిమింగిలం.

అప్రకారమే శ్రీరామచంద్రుడు చైత్ర శుద్ధ నవమినాడు భూలోకమందు అవతరించడం, రావణాసురుణ్ణి వధించడమూ కథలో వ్రాసినప్రకారం జరిగింది.






## 4

[కుండలినీ రాజ్య సైన్యాలు, ధనాగారం నింపేటందుకు పరరాజ్యాలమీదికి దాడి బయలుదేరినై. అశుభసూచకంగా తోకచుక్క కనబడింది. తుపానులోచిక్కి ఓడలు మునిగిపోయినై. కొందరు సైనికులు ఒక ద్వీపం చేరారు. అక్కడ క్రూరమృగాల నుంచీ, ఏకాకిమంత్రవేదినుంచీ తప్పించుకొని పారిపోసాగారు. తరువాత—]

సమరసేనుడూ సైనికులూ అలా కొంత దూరం పరుగెత్తిపోయి ఒక కొండప్రాంతం చేరుకొన్నారు. ఆ ఏకాకి మాంత్రికుని భయంకరమైన కంఠస్వరం ఇప్పుడు వారికింక వినిపించటంలేదు. 'బతికామురా బాబూ!'' అనుకొన్నారు వాళ్లు. పైగా, చతుర్నేత్రుడి వేగులు ఐన నల్లగూబా, నరవానరమూ ఏమయినయ్యో కాని, తమను మాత్రం వెంబడించటంలేదని వాళ్లు గ్రహించారు. ఇప్పటికి కొంచెం స్తిమితం చిక్కింది కదా అని సంతోషించారు.

అయితే, ఇక చేయవలసిందేమిటి?— మళ్ళీ మరిఒక ప్రమాదంలో చిక్కుకోక ముందే ఈ మంత్రాలదీవినుండి తప్పించుకొని బయటపడాలి. కాని, ఈ దీవి వదలిపోపటం ఎలా? తాము విడిచివచ్చిన ఓడలు సముద్రంలో ఏ దిక్కున ఉన్నవి? ఓడలలో ఉంచిన సైనికులు బాగా ఉన్నారా? అసలింతకూ తాము దీవికి ఏవైపున ఉన్నట్టు?

ఈ దీవిని అవరించుకొనివున్న మహా అరణ్యం మధ్యని దిక్కులు తెలిసేది ఎలా? ఆ ప్రాంతమంతటా ఎక్కడ చూచినా





కొండలు! ఆకాశాన్ని అంటే మహావృక్షాలు !! ఆ వృక్షాలను అల్లుకొనివున్న తీపర పాపర తీగలు !!! ఇటువంటి భయంకర ప్రదేశంలో దిక్కులేం తెలుస్తయి? దిక్కులు తెలిస్తే కద, తాము ఎక్కడున్నదీ కనుక్కోవటం?

ఈ చిక్కుప్రశ్నలతో సమరసేనుడు సతమతమవుతూ వుండగా, ఆకాశంలో అకస్మికంగా మబ్బులు విచ్చి, సూర్యుని దర్శనమైంది. సూర్యుని గమనాన్నిబట్టి చూడగా, తామిప్పుడు దీవికి ఏ దిక్కున వున్నదీ సమరసేనుడికి అర్థమైపోయింది.

'ఈ మంత్రాలదీవికి మనం ఇప్పుడు పడమటి దిక్కున ఉన్నాము. మన ఓడలు అటు తూర్పుతీరంలో ఉన్నవి. ఇదీ మన పరిస్థితి!' అన్నాడు సమరసేనుడు.

'అయితే, మనం ఎలాఐనా శ్రమపడి, తూర్పుతీరం చేరుకోవటం మేలుకద!' అని సైనికులలో ఒకడు తన వుద్దేశం చెప్పాడు.

'మంచిదే. కాని...అక్కడికి చేరుకోవటం అంత తేలిక కాదు. ఎన్నెన్ని ఆటంకాలు! పోనీ, ముక్కుకు సూటీగా పోదామా అంటే వీలులేదాయె. కొండలు- అడవులు- వీటన్నిటినీ మించి, భయంకరమైన క్రూర మృగాలు!—వాటి బారినుండి తప్పించుకొని బయటపడితేకద, మనం ఆ తీరం చేరుకోవటం!' అంటూ పెద్దగా నిట్టూర్చాడు సమరసేనుడు.

నాయకుడైన సమరసేనుడే ఈ విధంగా నిట్టూర్చేటప్పటికి సైనికులంతా వెలవెలబోయారు. అది చూచిన సమరసేనుడు వెంటనే 'మీరన్నట్టుగా, తూర్పుతీరం చేరుకోవటమే మంచిదని నాకూ తోస్తూవుంది. అలానే చేదాం. ఇక, కష్టాలమాటా?—మన చేతి ఖడ్గం, కుండలినీదేవి కటాక్షం—ఈ రెండు రకాలూ వున్నంతకాలం మనకు ఏ కష్టాలు వచ్చినా ప్రమాదం లేదు. రండి! నావెంట రండి!!—' అంటూ, వారిని హెచ్చరించి, తను ముందు నడిచాడు.



నాలుగడుగులు వేశారో లేదో వారు—సమరసేనుడు తక్కున ఆగిపోయి, 'ష్-ఆగండి!' అన్నట్టుగా తన సైనికులకు చేతితో సైగచేశాడు. అతడు అనుమానించినట్టుగానే, ఎదుట ఒక భయంకర దృశ్యం కంటబడింది. ఆదృశ్యం ఎంతటి ధీరుడికైనా పళ్ళు జలదరింపజేసే దృశ్యం!!—ఒక పెద్ద కొండచిలువ చెట్టుకొమ్మలమీదినించి మెల్లమెల్లగా కిందికి జారుతున్నది. ఢిగువను రెండు చిరుతపులులు, చిలువ దిగుతున్నసంగతి గమనించకుండా, ఆదమరచి నించున్నాయి.

వారు అలా చూస్తూవుండగానే, పులులలో ఒకదానిని కొండచిలువ మెడ పట్టుకొన్నది. ముందుగా చిలువ నోటితో దానిని ఒడిసిపట్టి, వెంటనే పులి శరీమంతటినీ, మోకుతో బిగించినట్టుగా మెలివేసుకొన్నది. ఇదిచూచి, రెండవ చిరుత భయంతో దూరంగా పారిపోయింది.

పారిపోయిన రెండవ చిరుత మళ్లీ యేమనుకొన్నదో కాని, ఒక్క పరుగున వచ్చి చిలువమీదికి దూకింది!

'పదండి. ఇటువంటి అపాయంలో చిక్కుకోకుండా మసలుకోవాలి మనం' అంటూ, సైనికులను హెచ్చరించాడు సమరసేనుడు.






ఆ తరువాత సైనికులందరూ ముందుకు సాగి, మరొకదారి పట్టారు. ఈ దారి నడవటానికి అంత అనుకూలంగా లేదు. అనేకములైన సెలయేళ్ళు పక్కనున్న కొండల మీదినించి దిగి, ఆ ప్రదేశాన్నంతటినీ బురదనేలగా మార్చినై. దీనికి ఫలితంగా—ఎక్కడ చూచినా రెల్లుపొదలూ, వెదురు పొదలున్నూ. అక్కడ తుంగ మోకాలు ఎత్తున పెరిగింది. దానిలోనించి నడచి పోవాలి. ఇలాటి దారిలో సైనికులందరూ చుట్టూ పరికించిచూస్తూ ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని, సాగిపోవలసి వచ్చింది. ఎప్పటిలాగా సమరసేనుడు ముందుండి దారి తీస్తున్నాడు. సైనికులకు ధైర్యం చెబుతూనేవున్నాడు. కొంతదూరం వెళ్ళినతరువాత సమరసేనుడు—

'ఈ ప్రాంతంలో బహుశా నీటివసతులు ఎక్కువగా ఉంటవని తోస్తుంది. అనగా, మడుగులవద్దకు నీటిజంతువులు తరుచు వస్తుంటాయన్నమాట. అయితే—అడవి జంతువులకు భయపడినంతగా మనం నీటిజంతువులకు భయపడ నక్కరలేదు' అని చెప్పాడు.

ఈ మాటలు అనటం పూర్తిఅయిందో, లేనేలేదో—పక్కని వున్న రెల్లుపొదలోనించి ఒక ఖడ్గమృగం ఇవతలికి వచ్చింది. దానిని చూస్తూనే, సైనికులు పారిపోదామని దిక్కు దిక్కులు చూచారు. ఇది గ్రహించిన సమరసేనుడు వాళ్ళతో—

'మనం పారిపోవ యత్నించటం మరీ ప్రమాదం కావచ్చు. ఎందుకైనా మంచిది. ఒకళ్ళవెనుక ఒకళ్లు వరుసగా నిలబడి, కత్తులుమాత్రం సిద్ధంగా ఉంచుకోండి!' అని సలహా చెప్పాడు.

ఖడ్గమృగం తల పైకెత్తి, భయంకరంగా ఒకసారి అరిచి, ముందరి కాలు దువ్వింది. సైనికులు భయకంపితులయ్యారు. అందరూ సమరసేనుడికేసి చూశారు.

రెండవసారి మళ్ళీ ఖడ్గమృగం కాలు దువ్వింది. ఈసారి వేగంగా ఒక్క ఊపుతో వారిమీదికి దూకింది!

అదును చూచి, సమరసేనుడు ఖడ్గంతో దాని వెన్నుమీద బలంగా పొడిచాడు. ఏదైనా మరిఒక జంతువు అయినట్టయితే దెబ్బకు పడిపోవలసిందే. కాని, ఆ పోటు ఖడ్గ మృగానికి ఏమీ ప్రమాదం చేయలేదు. అయితే—సమరసేనుడు చేసిన పనికి అది అరణ్యమంతా అదిరేటట్టు బొబ్బలుపెట్టి, మళ్ళీ ఒకసారి కాలుదువ్వి, సైనికులున్న దిక్కుకు ఒక్క ఉరుకు ఉరికింది.

ఇప్పుడు సైనికులు ఎంతమాత్రం భయ పడలేదు. నాయకుడు కనబరిచిన ధైర్యం వాళ్లసాహసానికి ఊతయిచ్చింది. నలుగురూ నాలుగు పక్కలా, ఇద్దరు దాని పొట్టమీదా ఇష్టంవచ్చినట్టల్లా పొడిచిపొడిచి వదిలారు!

ఖడ్గమృగం ఒక పక్కకు పడిపోయింది. బాధతో తన్నుకొంటూ, అరవసాగింది. సమరసేనుడు తన వాళ్లతో 'ఏదో, ఇప్పటికి గండం గడిచింది. దీని అరుపు విని మరి కొన్ని జంతువులు రాకముందే ఇక్కడి నుంచి తప్పుకొనిపోవటం క్షేమం!' అని చెప్పి, తక్షణమే బయలుదేరాడు.






కొంచెందూరం వెళ్ళేసరికి వారికి ఒక మడుగు కనిపించింది. అది చూడగానే—ఖడ్గమృగంతో పోరాడి అలసిపోయివున్న ఆ సైనికులు, అందులో దిగి దప్పితీర్చుకొందా మనుకొన్నారు. సైనికులలో ఒకడు 'ఎంత చక్కగా వున్నదీ నీరు! ఈ తేటనీటిలో ఒక్క బుడకవేస్తే బాగుండునే!' అన్నాడు.

ఇందుకు సమరసేనుడు—'ఈ దీవి మంత్రాల దీవి అనే సంగతిమాత్రం మరచి పోకండేం, జాగ్రత్త!'' అని హెచ్చరించాడు. బాగా దప్పికొన్న యిద్దరు సైనికులు ముందు మడుగులో దిగారు. అలా వాళ్లు మడుగులో దిగిన క్షణంలోనే—అ చుట్టుపట్ల నీరంతా కదిలినట్టయింది. హఠాత్తుగా వాళ్ళమీదకు నాలుగైదు మొసళ్ళు దూకినై. వాళ్ళు భయంతో కేకలుపెట్టారు. ఒడ్డునవున్న సమరసేనుడూ, సైనికులూ బాణాలు ఎక్కుపెట్టి వాటిపైకి వదిలారు. ఏమయితే నేం! ఆ సైనికు లిద్దరినీ, మొసళ్ళు మడుగు మధ్యకు లాక్కుపోయినై.

ఇలా జరగటం అందరినీ కుంగదీసింది. సమరసేనుడూ, మిగిలిన నలుగురు సైనికులూ దీనవదనాలతో అక్కడినుంచి బయలుదేరారు. ఈసారి అందరూ అతి





మెలుకువతో నడవసాగారు. కొంతదూరం వెళ్ళేసరికి వారికి ఎదుట గొప్ప సరస్సు ఒకటి కనబడింది.

'ఇది చాలా పెద్ద సరస్సులాగా వుంది. దీనిని దాటడం ఎలా?' అన్న సందేహం కలిగింది సమరసేనుడికి. అంతలో – సరస్సు ఒడ్డున ఎవరో స్నానం చేస్తున్నట్టుగా నీళ్ళు కదలబారటం కనబడింది. చూతామంటే ఎవళ్ళూ కనబడరు!! సరస్సుపైకంటా ఒక చెట్టుకొమ్మమాత్రం కనబడుతున్నది. ఆ కొమ్మనుండి ఒక పొడవాటి టోపీ వేలాడుతున్నది. ఆ టోపీకి మనిషికన్నులవంటి రెండు చిత్రమైన బెజ్జాలున్నయి.

ఈ వింత చూచి సైనికులంతా విస్తుపోయారు. వాళ్ళతోపాటు సమరసేనుడూ విస్తుపోవటమేకాని, ఇదంతా యేమిటీ అనే ప్రశ్నకు సమాధానం తెల్సుకోలేకపోతున్నాడు. సరస్సులో నీరు ఇంకా కదలబారుతూనే వుంది. ఆ కదలికబట్టి చూస్తే, ఎవరో కంటికి కనబడని ఒక వ్యక్తి స్నానం చేస్తున్నట్టు స్పష్టంగా తెలుస్తూనే వుంది.

సమరసేనుడూ సైనికులూ ఒక పొద మాటున వుండి, అదేపనిగా ఈ వింత చూస్తున్నారు. 'ఒకవేళ వీడు మాంత్రికుడైన ఆ ఏకాక్షి కాడుకదా కొంపదీసి!' అని అనుమానం కలిగింది సమరసేనుడికి. 'కాదు' అని వెంటనే నిశ్చయించుకొన్నాడు. ఐతే, టోపీమాట?–ఇది వాడిది కాదని రూఢిగా తేల్చుకొన్నాడు. మరైతే వీడు మరొక మాంత్రికుడా? అని మళ్ళీ సంశయం కలిగింది సమరసేనుడికి.

అంతలోనే సరస్సులోపలినుంచి ఏవో మాటలు వినబడసాగినై. ఆ స్నానం చేస్తున్న వ్యక్తి ఏవో శ్లోకాలవంటివి వల్లిస్తున్నట్టున్నాడు. ఆ కంఠంలో ఒక విధమైన కరుకుదనం, గాంభీర్యం కనిపించింది. వీడెవడో, అసాధ్యుడురా అని అనుమానం కలిగింది సమరసేనుడికి.



ఈ అనుమానాలతో మునిగితేలుతూవున్న సమరసేనుడికీ సైనికులకూ మరింత భయంకొలిపే ఇంకొక దృశ్యం కంటబడింది. మడుగు ఒడ్డున పొదల చాటునుంచి ఒక పాముతల పైకి లేస్తున్నట్టు కనిపించింది.

అది ఒక అపూర్వమైన వింతజంతువు! దాని ఆకృతి చూడగా, మన మామూలు ఏనుగకు నాలుగైదులంత బ్రహ్మాండమైన ప్రమాణంలో ఉన్నది. అంతటి జంతువుకు తలమాత్రం సన్నం!

ఏం జరుగుతుందోనని అందరూ దాని వైపే, రెప్పవాల్పక చూస్తున్నారు. అది మెల్లగా దాని సన్నపాటి తలను సరస్సు లోపలికి సాచింది. కంటికి కనబడని ఆ వ్యక్తిని పట్టడానికి అది యత్నిస్తున్నట్టు చెప్పనక్కరలేకుండానే తెలుస్తూవుంది.

ఆ వింతజంతువు తల నీటిమట్టానికి ఒక్క గజం ఎత్తుకు వచ్చిందో లేదో, వికృతమైన ఒక పెద్ద కేక వినిపించింది. కేక వినబడటం, చెట్టు కొమ్మనుండి వేలాడే పాత వాటి ఆ కన్నులటోపీ కిందకు జారడం ఒకే సారి జరిగింది!

అదే క్షణమందు, మడుగులో ఒక మనిషి ఆ కన్నులటోపీని ధరించి వుండటం కనబడింది. ఆ మనిషి కనిపించీ కనిపించడంతోనే వింతజంతువు పరుగుచ్చుకొని మాయమయింది.

'ఓహో, నీవా మహోదరా!—నన్నే భక్షించ దలిచావా! చతుర్నేత్రుణ్ణే మింగుదామని వుద్దేశించావా!!' అన్న మాటలు ఆ సమయాన సరస్సులోనుండి వినబడినై.

ఈమాటలకు సమరసేనుడూ సైనికులూ కంపించిపోయారు.

ఏకాకి మాంత్రికుడికి బద్ధవిరోధి ఐన ఈ చతుర్నేత్రుడి కంటపడకుండా ఇప్పుడెలా తప్పించుకుపోవటం? అనే ఆలోచనలో పడ్డాడు సమరసేనుడు.

—(ఇంకా వుంది)



# హనుమంతుడి తోక

(పిల్లల సాహిత్యాన్ని సృష్టించినవారిలో శ్రీ చింతా దీక్షితులుగారు ప్రముఖులు. వారి 'హనుమంతుడి తోక' అనే గేయంనుండి చిన్న మచ్చు ముక్కను చందమామ పాఠకులకు అందిస్తున్నాము.)

లంకకు వెళ్లిన హనుమంతుడు—
రాములవారిని భూషించాడు, రావణు తిట్టాడు
రావణాసురుడు కోపముతోను 'కోతి!' అన్నాడు
'కోతిని బట్టి తోకను కాల్చి తన్నం' డన్నాడు.
మోపులకొద్దీ బట్టలు తెచ్చి తోకకు చుట్టారు
ఎంత చుట్టినా ఎంత చుట్టినా తోక పెరుగుతోంది
రాక్షసులంతా విసిగీ విసిగీ నూనెలు తెచ్చారు
కుండలకొద్దీ బిందెలకొద్దీ తోకను తడిపారు
చెకుముకి కొట్టి నిప్పును పట్టి బట్టల కట్టించి
'కోతికి శాస్తి అయినది!' అంటూ గోల చేసినారు
రాముని తలుచుకు సీతను తలుచుకు హనుమంతులవారు
హుమ్మని అర్చి ఘమ్మున లేచి రాక్షసులను చూచి
గిరుగిరున తోకను వాళ్ళ మొహాన్న తిప్పాడు
'మొర్రో!' అంటూ రాక్షసులంతా పారిపోయినారు
ఆకాశానికి అవాయిలాగ హనుమంతుడు ఎగిరి
అంటించాడు అంటించాడు లంకాపట్నాన్ని
రాచనగరులూ అంతఃపురములు నాట్యశాలలూ యాగశాలలూ
పశువులశాలలు మండపంబులూ
భగభగ భగభగ భగభగ భగభగ మండుతోంది తోక
చురచుర చురచుర చురచుర చురచుర అంటుకుంది లంక
పటపట పతేలు ఢామ్మ ఢామ్మనీ మండుతోంది లంక
పిడుగులు కురుస్తు మెరుపులు మెరుస్తు మండుతోంది లంక!
చిన్నలు పెద్దలు పురుషులు స్త్రీలూ రాక్షసులంతాను
ఇళ్లను విడిచి బయటికి వచ్చి గొల్లున ఏడ్చారు
తోకదెబ్బకీ రాక్షసులంతా చచ్చిపోయినారు
తోక ముడిచి హనుమంతుడు వచ్చి రాముని మొక్కాడు!!

# అట్టి వీాదిబొమ్మ

కొంతకాలమైనతరువాత దుర్యోధనుడు పిలిపించగా, పంచపాండవులు ద్రౌపదితో సహా హస్తినాపురం చేరుకొన్నారు. చాలాకాలానికి కంటబడిన ద్రౌపది గాంధారితో ముచ్చటిస్తూవుండగా, ప్రాతికామి అనేవాడు అక్కడికి వచ్చి 'ధర్మరాజు నిన్ను పందెంలో ఓడిపోయాడు. మా కౌరవేశ్వరుడు నిన్ను రమ్మంటున్నారు. రా వెంటనే!' అంటూ ద్రౌపదిని పిలిచాడు.

అందుకు ద్రౌపది నివ్వెరపడి, 'అబ్బాయీ!—ధర్మరాజు తను ఓడిన తరువాత నన్ను ఓడినాడా? ఓడకముందే నన్నోడినాడా?' అని ప్రశ్నించింది. వాడు బదులు చెప్పకుండానే ఆమెను రమ్మని తొందరచేసి, సభకు తీసుకపోయాడు. ఆ నిండుసభలో ఆమె నిలబడింది. అలా నిలచిన ద్రౌపదిని సభ మధ్యకు ఈడ్చుకురమ్మని దుర్యోధనుడు ఆజ్ఞాపించాడు. ఆజ్ఞప్రకారం దుశ్శాసనుడు వెంటనే ఆమె కొప్పుపట్టి లాగాడు.

అంతటి గొప్పసభలో అందరూ తెల్లబోయి చూస్తున్నారేకాని, ఒక్కడూ కిక్కురుమనలేదు. నీచమనస్కుడైన దుర్యోధనుడు అంతటితో అగలేదు. 'చూస్తావేం!' అని సంజ్ఞచేశాడు దుశ్శాసనుడికి. అలా చేయటమే తడవుగా దుశ్శాసనుడు ఆమె కట్టుకొన్న వస్త్రాలు లాగివేయజొచ్చాడు.

ఆ సమయంలో ఎవ్వరూ ఆమెను రక్షింపలేకపోయారు. ఇటువంటి తగని పనిని భీష్మాదులుసైతం మానిపింపజాలక నిశ్చేష్టులై నిలబడిపోయారు.

అప్పుడు దిక్కులేని ద్రౌపది పొందిన ఆవేదన ఇంతంత కాదు. తన మానం కాపాడమని ఆమె నిశ్చలమైన మనస్సుతో, ఆ కృష్ణభగవానుణ్ణి వేయి విధాల వేడుకొన్నది.

మానవతి ఐన ద్రౌపది మొర శ్రీకృష్ణుడికి వినిపించింది. ఆమెను కాపాడటానికి భగవానుడు వెంటనే పూనుకొన్నాడు. అందుకు ఫలితంగా—దుర్మార్గుడైన దుశ్శాసనుడు ద్రౌపది చీరను ఎంతగా ఒలిచినప్పటికీ అంతులేకుండా అది పెరిగిపోయి, ద్రౌపది శరీరాన్ని అంటిపెట్టుకొనే ఉంటూ వచ్చింది! అందుచేత, దుర్యోధనుడి దుర్మార్గపు వ్యూహం ఎంతమాత్రం నెరవేరలేదు.

ద్రౌపదీదేవి పాతివ్రత్యాన్ని ఈవిధంగా కాపాడిన శ్రీకృష్ణుని మహిమకు సభలోఅందరూ ఆశ్చర్యపోయారు!

# పాపం పండింది




పరిమళ అనే పట్టణానికి రాజు ముక్తవర్మ. ఆయనరాణి ప్రేమసుందరి. రాజూరాణీ ఒక నాటి సాయంత్రం పాదచారులై విహారానికి బయలుదేరారు. సంతోషంలో వారు అలా ఎంతదూరం వెళ్ళారో వారికే తెలియదు.

పోయి పోయి ఒకచోట నిలబడేసరికి, పాడుపడిన ఒక కోట కనిపించింది. వారు దగ్గరసా వెళ్ళారు. ఇంకా దగ్గరసా వెళ్లేటప్పటికి రాజు కాళ్ళు రెండూ నేలకు అంటుకుపోయినై. చూస్తూవుండగానే, రాణి ఒక పంచరంగుల అందాల చిలుకగా మారిపోయింది.

రాజు కదలలేకపోయాడు. అందుచేత ఏంచేతామన్నా అతనికి వశం కాలేదు. ఆ పంచరంగుల చిలుక, రాజు చుట్టూ అలానే తిరుగుతూవుంది. ఈ అవస్థకు చేసేది లేక, రాజు విలపించాడు. కీచ్ కీచ్ మంటూ చిలుక యేడువ నారంభించింది.

అంతలో సూర్యాస్తమయమైంది. పున్నమిచంద్రుడు పుట్టాడు. కోట లోపలి నుండి ఒక విచిత్రమైన స్త్రీ ఇవతలికి వచ్చింది. వస్తూనే, చిలుకను చేతులతో పట్టివేసింది. అప్పుడు రాజు గోలపెట్టుతూ, 'ఎవరవు నువ్వు? ఏమిటీ మాయ అంతా?' అని ఆవేశంతో కేకలు వేశాడు.

'ఓహో, నీవా? రాజువా? ఈమె నీ రాణీయా?—హహ్హహ్హ!—వదులుకో. నీ రాణీ ఆశ ఇంక వదులుకో. నీదారిని నువు వెళ్లవచ్చు. ఇంకెప్పుడూ ఇక్కడికి రాకేం! ఇదుగో, ఈ సంగతి ఎవళ్ళతోనూ చెప్పను అంటే నిన్ను విడుదల చేస్తాను. చెప్పితివా, తల రెండు చెక్కలై చస్తావు! జాగర్త!!'

ఎమ్. ఏబెల్, ఎం. ఏ.




అన్నదామె, భీకరంగానూ వెటకారంగానూ. తన చేతిలో ఉన్న దండంతో ఆమె రాజును తాకగానే, రాజుకు కాళ్ళు ఊడివచ్చి, మామూలుగా నడవసాగాడు. అప్పుడు రాజు 'నా ప్రేమసుందరిని నాకు ఇస్తేగాని వూరుకోను. ఇక్కడినుంచి కదలనే కదలను' అని పట్టుపట్టాడు.

'నీ పని ఇలా వుందా?' అని చెప్పి, ఆ మంత్రకత్తె రాజును మళ్ళీ మంత్రంతో బంధించి, పంచరంగులచిలుకను తీసుకొని కోటలోపలికి వెళ్ళిపోయింది.

కోటలోపల—అది ఒక బ్రహ్మాండమైన గది! ఆ గదిలోని పంజరంలో సరీగా తొంభై తొమ్మిది పంచరంగుల చిలుకలు వున్నయి. ఆ మంత్రకత్తె మళ్ళీ ఒకసారి చిలుకలన్నిటినీ లెక్కపెట్టి సరిచూచుకొన్నది. ఒక తాటాకు గ్రంథం తీసిచూచి, 'అబ్బ!— నేటికికదా నా వ్రతం పూర్తిఅయింది? ఇకేముంది, అమరత్వం! దేవేంద్రలోకం!!—' అంటూ కేరింతలు కొట్టింది. కొత్తగా ఇప్పుడు తెచ్చిన చిలుకనుకూడా పంజరంలోపలికి నెట్టి, తలుపు మూసివేసింది.

తరువాత ఆమె లోపలికి పోయి, ఒక పెద్ద బానా, తళతళ మెరిసే పదునైన కత్తీ తీసుకవచ్చింది. తాటాకుపుస్తకం తెరచింది. దానిలో ఉండే మంత్రాలు పఠిస్తూ, ఒకొక్క చిలుకనే తీసి చేతపట్టి, పీక కోసి ఆ రక్తాన్ని బానలో పోస్తూవచ్చింది. తొంభై తొమ్మిది చిలుకలనూ చంపి, వాటి రక్తం బానలో పోయటం పూర్తిఐంది. మంత్రకత్తెకు ఉత్సాహం ఎక్కువయింది.

ఇంకొక్క చిలుకను సంహరించటంతో తన వ్రతం పూర్తికాబోతున్నదికదా అనే ఆ ఉత్సాహంలో మంత్రకత్తె, చిట్టచివర తను పట్టిన 'ప్రేమసుందరి' అనే చిలుకను చేతపట్టి, దానితో మాటాడసాగింది.

మంత్రకత్తె అలా మాటాడుతూవుండగా, అదునుచూచి, చిలుక టపీమని ఆమె కన్ను

పొడిచింది. ఆబాధతో మంత్రకత్తె చిలుకను తిడుతూ, కన్ను తుడుచుకొంటూవుండగా రెండవకన్నుకూడా పొడిచివేసింది!

రెండుకళ్ళూ పోయినై మంత్రకత్తెకు. ఏడుస్తూ, ఆమె చిలుకను పట్టబోయింది. చిలుక ఎక్కడ వుంది? తుర్రుమని ఎగిరి, ఆ వెంటనే రాజువద్దకు చేరుకొన్నది.

'ఉండు నీపని పట్టిస్తా...!' అని ఏమేమో సణుగుతూ, అలా తడుముకొంటూ పోయింది మంత్రకత్తె. ఐతే, మెట్లు ఒకపక్క దిగటానికి బదులు మరొకపక్క దిగటంతో కిందపడి, మూర్ఛపోయింది. ఆ పడటంలో చెయి జారి, మంత్రదండం యెక్కడికో పోయింది! ఈ స్థితిలో, చేసేదేమీ లేక ఆ మంత్రకత్తె అలానే కూర్చొని ఏడుస్తున్నది.

* * *

అక్కడ, పరిమళనగరంలో—విహారం కోసం వెళ్ళిన రాజూ రాణీ ఎంతకూ రాక పోయేసరికి, తగని ఆత్రంతో పరివారాన్ని నలుమూలలకూ పంపించి, మంత్రికూడా స్వయంగా బయలుదేరాడు.

మంత్రి పోయి పోయి, మంత్రకత్తె వుండే కోట సమీపానికి చేరుకొన్నాడు. ఆ దారిలో, బాధపడుతున్న మంత్రకత్తె, మనిషి అలికిడి కనిపెట్టింది. మంత్రిని భోగట్టాచేసి, అతను




ఫలానా అని తెలుసుకొన్నది. 'నాయనా, నే నెవరనుకొన్నావు? నేనే మీ రాణిని; ప్రేమ సుందరిని. ఒక మంత్రవాది నన్ను ఈ గతికి తెచ్చాడు. నా దగ్గర మంత్రదండం పడివుంది. ఒక్క పనిచెయ్యి: ఆ దండం పట్టుకొని కోటలోపలికి వెళ్ళు. అక్కడ ఒక బానలో ఎర్రటి ద్రావకం వుంటుంది. అది ఒక గిన్నెతో తెచ్చి నా నోటిలో పోస్తే నేను నా అసలురూపం పొందుతాను. ఆ తరువాత రాజునూ చూపిస్తాను' అన్నది.

ఆమె చెప్పినట్టుగానే మంత్రదండం తీసుకొని లోపలికి పోయి, బానలో వుండే రక్తాన్నితెచ్చి ఆమెనోటిలో పోశాడు మంత్రి.



పోసీపోయటంతో, రూపంలో మార్పు రావటానికి బదులు, ఆమె మరణవేదన పొందసాగింది. "అయ్యో! మోసం జరిగిందే!—ఆ ప్రేమసుందరి నన్నే చంపిందే. ఇంతకూ, నా పాపం పండింది. తొంభైతొమ్మిదిమంది స్త్రీలను హత్యచేసిన పాపం ఇప్పటికి పండింది!!" అంటూ, యేడ్పు రాగాలు పెట్టింది.

ఈమె తండ్రి ఒక తాటాకు గ్రంథంలో మహామంత్రాలు రాసిపెట్టి పోయాడు. అందులో ఒకానొక మంత్రం కోటిసారులు జపించి, పూర్తికాగానే నూరుమంది స్త్రీలను చిలుకలుగా మార్చి, వాటి రక్తాన్ని తీర్థంగా పుచ్చుకొన్నట్టయితే, ఆమె అమరత్వం పొందుతుందట!—అనగా కోరుకొన్న యే రూపమైనా పొందగలదు. ఆమె చిరంజీవి—అంటే చావు లేదు.

ఇంతటి ఆశతో ఆమె చేపట్టిన వ్రతదీక్ష రెండువిధాలుగా చెడిపోయింది: మొదటిది కట్టకడపటి చిలుకఐన ప్రేమసుందరి తప్పించుకుపోవటం. పైగా, ఆ చిలుక ఆమె కళ్ళు పొడవటంతో మంత్రకత్తె దుష్ట రక్తం బానలోని రక్తంలో కలసి, అసలు ఆ తొంభైతొమ్మిది చిలుకల యొక్క పవిత్ర రక్తమూ మలినమైపోవటం! అయితే—తన బాధలో ఈ సంగతులు మంత్రకత్తె తెలుసుకోనే లేకపోయింది.

తన కథ అంతా మంత్రికి చెప్పుకొని యేడ్చిన మరి కొంతసేపటికే మంత్రకత్తె గిలగిల తన్నుకొని, అక్కడే పడిచచ్చింది!!

తరువాత—మంత్రి వెతుక్కుంటూ రాగా, నేలకు అంటుకుపోయిన రాజూ, ఆయన చుట్టుచుట్టూ తిరుగుతూవున్న పంచరంగుల చిలుకా కనిపించారు. మంత్రి తనవద్దనున్న మంత్రదండం వాళ్ళ ఇద్దరకూ తాకించేటప్పటికి రాజూ రాణీలకు మామూలు రూపాలు వచ్చినై! అందరూ సుఖంగా రాజ్యం చేరుకొన్నారు.



# రామాయణ

# సామెతలు



నిత్యకృత్యంలో మనం, తెలియకుండానే రామాయణ సంబంధమైన సామెతలు ఎన్నో వాడుతూ ఉంటాము. ఈ సామెతలు ఒక్కొక్క దానికి ఒక్కొక్క కథ ఉంటూవున్నది. మచ్చుకి, 'పదింటిలో పదకొండు' అనే సామెతకు సంబంధించిన గాథను ఈసంచికలోనే మీరు చదువుదురుగాని.

1. నవ్వు నాలుగువిధాల చేటు
2. కిష్కింధలో కోతి
3. హనుమంతుడి ముందరా కుప్పిగంతులు ?
4. సుగ్రీవాజ్ఞ
5. ఇంటి గుట్టు లంకకు చేటు
6. రామబాణం
7. సీతా రామ కష్టాలు
8. రామాయణమంతా విని రాముడికి సీత ఏమవుతుందన్నట్టు
9. చూచిరమ్మంటే కాల్చిరావటం
10. రామాయణంలో పిడకల వేట్లాట
11. ఉడుతాభక్తి
12. రాముడివంటి రాజుంటే హనుమంతుడివంటి బంటూ ఉంటాడు
13. రామరాజ్యం
14. లంకనించి వచ్చినవాళ్ళంతా రాక్షసులే
15. కుంభకర్ణుడి నిద్ర
16. పదింట్లో పదకొండు

—శాస్త్రి



లోగడ మీరు 'ఒంటిమిట్ట పుట్టుక' అనే కథను చదివిఉన్నారు. ఆ గ్రామమందు వెలసిన కోదండరామస్వామినిగురించి ఒక పూర్వకవి చెప్పిన రెండుచక్కటి గేయాలు వినండి :

పుట్టినప్పుడె హరుని చాపము
పూని నడిమికి ద్రుంచెనే ;
మట్టి బుట్టిన జానికమ్మను
మమతతో పెండ్లాడెనే ;
చట్టురాయై యున్న హల్యను
చక్కగా కరుణించెనే ;
మెట్టి శాపము తీర్చెనే ఒంటి
మిట్ట శ్రీ రఘురాముడు.

* * *

తారహార పటీర శారద
ధవళకీర్తి విహారుడే ;
ఘోర రావణ కుంభకర్ణుల
గొట్టివేసిన శూరుడే ;
చారు మోహనరూపుడే కౌ
సల్య కూరిమి కొమరుడే ;
మేరు నగ సమ ధీరుడే ఒంటి
మిట్ట శ్రీ రఘురాముడు.




చాలాకాలం క్రిందట, ఒకానొక ఘోరారణ్యానికి సమీపమందు, పాపన్న, పాపమ్మ అనే పేదదంపతులు ఉంటూవుండేవాళ్ళు.

వాళ్లకు సంతతి లేకపోవటంచేత సోమన్న అనే కుర్రవాడిని తెచ్చిపెంచుకొంటూవున్నారు. పసివాడు పన్నెండేళ్ళవాడు. సౌమ్యుడు. కాని, అనాథుడు.

ఆ దంపతులు బాగా వయసుమళ్ళినవాళ్ళు. పైగా, సోమరులు. అందుచేత వాళ్ళు పొలంపనీ, ఇంటిపనీ అంతాకూడా పసివాడి తలపైనే వేయడం మామూలైంది.

ఒకనాడు—పాపమ్మ చెప్పిన పనులన్నీ పూర్తిచేసి, తరువాత కాస్తంత గోడకు చేరబడి కూర్చున్నాడు పసివాడు. అంతలోనే ఎక్కడినించి వచ్చాడో పాపన్న, యమధర్మరాజులాగా వచ్చి, మండిపడుతూ—

"ఏమిరా, నీకూ విశ్రాంతి కావలసి వచ్చిందా? ఏమంత అలసిపోయావు నా తండ్రీ! కట్టెలూ కొట్టలేదు. వంటపనీపూర్తి చేయలేదు. లే, లే. నిన్ను కూర్చోబెట్టి మేపటానికి మాకేమంత డబ్బు తేరగా లేదు..." అంటూ హుంకరించాడు.

అసలే అలసిపోయివున్న సోమన్నకు ఈ మాటలు వినగానే అగ్గిమీద గుగ్గిలం వేసినట్టయింది. 'ఏమిరా భగవంతుడా ఈ యాతన! చాలీచాలని తిండితో ఎన్నాళ్ళు గడపటం!–' అని మనసులో చాలా బాధపడి, కుమిలిపోసాగాడు.

అలా కుములుతూనే సోమన్న పాయిమీద ఎసరుపెట్టి, కూర్చున్నాడు. వాడి కొక ఆలోచన తట్టింది: 'వీళ్ళు పెట్టే బాధలు వదుల్చుకోవాలంటే అడవిలోకి పారిపోవటం తప్ప వేరే దారి లేదు' అని తేల్చుకొన్నాడు. అలా ఆలోచనలో పడి కూర్చున్న పసివాడికి అకస్మాత్తుగా వీపుమీద వేడివేడిగా ఒక్క చరుపు తగిలింది!

డి. స్వరాజ్యలక్ష్మి

"ఎసరు పొంగి, బుగ్గిపాలవుతూవుంటే చూస్తూ పూరుకుంటావా? ఏమిట్రా పర ధ్యానం? బాగానే తిందువుగానిలే..." అని సాధింపు ప్రారంభించింది పాపమ్మ.

ఇక ఈ తిట్లూ కొట్లూ పడలేకపోయాడు సోమన్న. తెగించాడు. ఒక్క గెంతులో బయటపడి, అడవిలోకి పరుగుతీశాడు. వెంటనే పాపమ్మ భర్తకోసం కేకపెట్టింది. పాపన్న హడావిడిగా వచ్చి, సోమన్న పరుగెత్తిపోవటం చూశాడు. పాపన్న ఆత్రంతో బిగ్గరగా ఇలా అన్నాడు:

'ఒరే నాయనా, సోమూ!—పోయి పోయి, అడవిలోకి పోతావేమిరా! అక్కడ క్షణ మైనా బతకలేవుసుమా. అడవి చుట్టూ బ్రహ్మండమైన గోడ వుంది. అది నువు దాటలేవుసుమా. అడవిఅంతా భయంకర మృగాలతో, పీడలతో, పిశాచాలతో నిండి వుంటుందిసుమా!'—అని పెద్దగా అరిచి కేకలుపెట్టాడు.

ఏమన్నాకానీ, జీవితంమీద విరక్తితోచిన ఆ పసివాడు ఈ కేకలేవీ వినిపించుకోనే లేదు. 'క్రూరమైన ఈ మానవుల కంటె ఆ పిశాచాలే నయం!' అని గట్టిగా తోచింది వాడికి. అందుచేత, వెనుదిరిగి చూడక, అదే ఊపుతో ముందుకు సాగిపోయాడు.




కొంతదూరం పరుగెత్తేసరికి, పాపన్న చెప్పినట్టుగానే బ్రహ్మండమైన గోడ ఒకటి అడవిచుటూ ఆవరణగా కనిపించింది. ఆశ్చర్యపోయాడు సోమన్న. వాడు చూస్తూ వుండగానే ఆ గోడ దానంతటదే రెండుగా చీలి మనిషి పట్టేటంత దారి యిచ్చింది.

ఇదేమిటో చిత్రం చూదామని, పసివాడు ఆ చీలిక వెంబడే దూరిపోయి, అడవి ప్రాంతంలో ప్రవేశించాడు. అక్కడ వుండే మహావృక్షాలూ, వింత కొలిపే రకరకాల మొక్కలూ, తీగలూ—వీటి నీడకు పట్ట పగలే ఆ ప్రదేశమంతటా మేఘాలు కమ్మి నట్టుగా కటికచీకటి అలముకొన్నది.



మెల్లగా అడుగులు వేస్తున్నాడు సోమన్న. 'నేనేమీ భయపడను. ఈ చీకట్లూ, నీడలూ నన్నేం చేస్తాయి? ఇక్కడ వుండే క్రూర మృగాలు మాత్రం నన్నేం చేస్తాయి? సరే, కానీ, ఇప్పుడు నేనేం చేయాలీ...?' అని తనలోతనే బిగ్గరగా అనుకొన్నాడు.

'ఇప్పుడు నువ్వు ఏం చేయాలీ అంటే...' అని ఒక కంఠస్వరం వెంటనే సోమన్న చెవిని పడింది. 'నువ్వు నా వేళ్ళమీదినించి దిగి అవతలికి పోవాలి. తెలిసిందా?' అన్నది, మళ్ళీ ఆ ధ్వని.

నివ్వెరపోయి, వెనక్కు తిరిగిచూచాడు సోమన్న. అది ఒక బ్రహ్మాండమైన వృక్షం.

"ఎవరూ అ మాటాడింది? నువ్వేనా?" అని ఆశ్చర్యంతో అడిగాడు సోమన్న, ఆ వేళ్ళుగల చెట్టుకేసి తిరిగి.

'అవునురా అబ్బీ, నేనే! ముందు నా వేళ్ళమీదినించి దిగి అవతలకి పో. నువ్వేం, తక్కువ బరువున్నావా? అట్టేసేపు భరించ లేను,' అన్నది ఆ వింతవృక్షం.

ఈ మాటలతో పసివాడికి కొంత ధైర్యం చిక్కింది. 'నువు చెట్టువేఅయినా, నాతో దయగానే మాటాడావే! సరే కాని, నా కిప్పుడు బలే ఆకలవుతున్నది. తినటానికి ఇక్కడేమైనా దొరుకుతుందేమో చెప్ప గలవా?' అని అడిగాడు నిర్భయంగా.

'దానికేం! ఏంకావాలో చెప్పు' అన్నది ఆ మహావృక్షం. ఇందుకు సోమన్నకు చాలా సంతోషం కలిగింది. 'చూస్తే, నీవు కల్ప వృక్షంలాగా ఉన్నావే! ఈ అరణ్యమంటే నాకు మునుపు ఎంతో భయం వేసేది. ఇప్పుడు నీ మాటలు వినగానే నాకు నిబ్బరం కలిగింది. పైగా, ఈ చక్కటి ప్రదేశం చూచి మనసు తీరా అనందించ గలుగుతున్నాను' అన్నాడు.

అప్పుడు ఆ వృక్షం హేళనగా నవ్వింది: 'అమాయకుడా!–నువ్వు ఇప్పుడు ఆహారం గుటకాయస్వాహా చేదామనుకొన్నావుకదా.



అలానే యెవరన్నా వచ్చి నిన్నే గుటకాయ స్వాహా చేస్తారనుకో. ఫరవాలేదనుకొంటే, ఇది చక్కటి ప్రదేశమే' అన్నది.

చెట్టు ఇలా అనేటప్పటికి సోమన్న హడిలి చక్కా పోయాడు. 'అయితే, కల్ప వృక్షమా! నువ్వే నన్ను మింగేస్తావా?' అంటూ ఏడుపుముఖం పెట్టాడు.

"నేనేం నిన్ను మింగను; నరమాంసం అంటే నాకు కిట్టనే కిట్టదు" అన్నది చెట్టు. కాస్సేపు ఆగి, "అయినా, ఆ దీర్ఘనాసికకు మాత్రం మనిషిమాంసం అంటే మహా యిష్టం. మరో ఐదు నిమిషాలలో ఎలానూ వస్తుంది అది. కనుక—నువు దానికి ఆహారం కాబోయేముందుగానే నీ ఆహారం ముగించుకో" అన్నది నిట్టూరుస్తూ.

ఈ మాటలకు సోమన్న భయంతో కంపించిపోయాడు. తినే తినే ఫలహారం వదిలివేస్తూ—

"ఆ దీర్ఘనాసిక యింకొక్క ఐదు నిమిషాలలో వస్తుందా? వచ్చి నన్ను భక్షించే వరకూ నే నిక్కడ కూర్చుంటానా? ఎటన్నా పారిపోయి దాని కంటపడకుండా దాక్కుంటాను" అంటూ సోమన్న తక్షణమే బయలుదేరాడు. అలా సోమన్న కొంత దూరం పరిగెత్తగానే ఆ ప్రాంతమంతా




వేడిగాడుపులతో భరించ శక్యంకాకుండా పోయింది.

'ఇంత కటిక చీకటి ప్రదేశంలో యెక్కడి నుంచి వస్తున్నదింత వేడి?' అని తన చుట్టూ కలయజూచాడు సోమన్న. అంతలో అతడు నిలబడివున్న చోటున చెట్టు కదిలినట్టయింది. తరవాత మాటలు వినబడినై:

"దీర్ఘనాసిక సంగతి నీకు తెలియదులా వుంది. ఆ భయంకర జంతువుకు ఆకలి వేస్తే—చుట్టుపట్ల కొన్ని యోజనాలవరకూ మంటలు చిమ్ముతుంది. ఆ వేడికి భూమి అంతా కాలిపోవలసిందే. అదుగో చూడు!" అన్నది. సోమన్న వణికిపోతూ అటుకేసి






చూశాడు. భయంకరమైన ఒక జంతువు మంటలు గుప్పిస్తూ అతడివేపుకే పరుగెత్తుకొనివస్తున్నది. సోమన్న కాలికొద్దీ పరిగెత్త సాగాడు. కాని ఆ భయంకర జంతువు సకిలిస్తూ వానితో ఇలా అన్నది:

"అబ్బాయీ! నువ్వు పరుగెత్తి లాభం లేదు. మామూలు వేళల్లో అయితే నేనూ నీతో పరుగుపందానికి వచ్చేదాన్నే. కాని ఇప్పుడు నాకు కడుపులో కరకరమని ఆకలి అవుతోంది. ఎలాగూ నువు తప్పుకొని పోలేవు కనక, కాస్త ఇటు నాలుగు అడుగులు వెయ్యి. ఇద్దరికీ శ్రమ తప్పుతుంది!" ఈ మాటలతో సోమన్న, ఇక పరిగెత్తి పోవటం లాభం లేదని గ్రహించాడు. ఎలాగూ చావు తప్పదు కనక అక్కడే నుంచుని కళ్ళు మూసుకుంటే సరిపోతుందనుకొన్నాడు. అంతలో దీర్ఘనాసిక వానిదగ్గరకు వచ్చింది. భయకంపితుడై నిలబడివున్న సోమన్నను మింగేటందుకు నోరు తెరిచింది. అంతలోనే దానికి పెద్దతుమ్ము వచ్చింది.

"అబ్బా! ఏమిటో ఈ తుమ్ములు—చచ్చిపోతున్నాను. ఏదో వేళకు ఇంత కమ్మటి ఆహారం కడుపులో వేద్దామనుకొనేసరికి ఈ తుమ్ములొకటి ముంచుకొస్తయి. ఈ శైత్యభారం వదిలే సాధనం ఎవరైనా చెబితే, వాళ్ళకు మొక్కుకొందును!" అన్నది.

దీర్ఘనాసిక ఇలా అనేసరికి సోమన్నకు ఎక్కడలేని ధైర్యం కలిగింది.

"నువ్వు అడిన మాట తప్పనిదానివైతే, నీ జలుబు నిమిషంలో పోగొడతాను నేను" అన్నాడు. 'తప్పను' అని మాట ఇచ్చింది దీర్ఘనాసిక. నువ్వు ఈ చీకటికోణం వదిలి బయటికి వచ్చెయ్యి. మా దేశంలో కావలసినంత సూర్యరశ్మివున్నది. తుమ్ములకు అదే అమోఘమైన మందు" అన్నాడు.

"సూర్యుడేమిటి? సూర్యరశ్మి ఏమిటి?" అంటూ దీర్ఘనాసిక ఆశ్చర్యపడుతూ వానిని ఎన్నో ప్రశ్నలు అడిగింది.

అప్పుడు సోమన్న, సూర్యకిరణాల చికిత్సనుగురించి దానికి చెప్పాడు.

దీర్ఘనాసిక సంతోషానికి అంతులేక పోయింది. సోమన్న ముందూ, అది వెనకా నడుస్తూపోయారు. కొంతదూరంలో అడవి చుట్టూ ఎత్తయిన గోడ కనబడింది. దీర్ఘ నాసిక నాసికారంధ్రాల్లోనించి గోడమీదకు మంటలు వదిలింది.

గోడ రెండుగా విచ్చి, చక్కటి రహదారి ఏర్పడింది. సోమన్న సరాసరి దీర్ఘనాసికను వెంటబెట్టుకొని పాపయ్య దంపతుల వద్దకే బయలుదేరాడు. దూరాన వుండగానే, ఆ భయంకర జంతువునూ, దానివెంబడే వున్న సోమన్ననూచూసి వాళ్ళు హడిలిపోయారు.

"మన్నించు సోమన్నా! మేము నీకు చాలా అపచారం చేశాము. బుద్ధి వచ్చింది" అని వానికి శరణుజొచ్చారు.

అప్పుడు సోమన్న 'అలా అనుకోవద్దు. మీరు అప్పుడు నన్ను శిక్షించటంవల్లనే నాకు ధైర్యం కలిగింది. మనం ఇతరుల మంచిని కోరితే, వాళ్ళూ మన మంచిని కోరతారని నేను తెలుసుకొన్నాను.

'ఆ మహారణ్యంలో ఒక వింతవృక్షం నన్నాదరించి నాకు తిండి పెట్టింది. పిశాచి గణానికి చెంది, నరమాంసం భక్షించే ఈ భయంకర మృగం నన్ను నమ్మి, ఎటు వంటి హానీ చేయకుండా నా వెంట వచ్చే సింది. ఇదంతా మీ చలవ. నేను మీకు ఋణపడేవున్నాను' అన్నాడు.

—దీర్ఘనాసికను సోమన్న తన వెంటనే తిప్పుకొంటూ, ఎంతో ఆదరంతో దానిని సంరక్షించాడు. సూర్యకిరణాలతో చికిత్స చేసి, దాని తుమ్ముల బాధ శాశ్వతంగా నయంచేశాడు.

నాటినుంచీ అది విశ్వాసంగలకుక్కలాగా మెలగసాగింది. ఇది చూచి ఆ ముసలి దంపతులు 'మనకంటే పిశాచమే నయం...' అని అనుకొంటూ ఉండేవాళ్ళు.



# వ్యాసరచన పోటీ

బహుమతి పొందిన రచన

చిన్నప్పటినుంచీ నాకు పత్రికలలో ప్రకటనలు తిరగేయటం, కంపెనీలకు ఉత్తరాలు రాయటం చాలా సరదా. 'ఉచితము' అని వ్రాసివున్న ప్రకటన ఏదైనాసరే కంటబడిందో, కార్డు రాసేశానన్నమాటే. ఒకప్పు డొక కలకత్తా ప్రకటన చూచాను. వెంటనే కార్డు రాసివేశాను, కంపెనీకి.

నాలుగోరోజుకల్లా కలకత్తానుంచి వి. పీ. బంగీ వచ్చింది. పోస్టుమన్ నా పేరుపెట్టి పిలిచాడు, క్లాసులో. నేను సొమ్ముతో తయారుగానే వున్నా. బంగీ తీసుకోవటమే తడవుగా కుర్రాళ్లంతా నాచుట్టూ గుమికూడారు. వాళ్ళే బంగీ విప్పేశారు. చూడగా 144 బహుమతులు మొత్తం తేలింది—25 నీటి బొమ్మలు, 72 గుండుసూదులు, ఇలాటివి ఇంకా ఏవేవో. వీటిమాటకేం! — ఫౌన్టెన్‌పెన్, అదనంగా మరిఒక బంగారు పాళీ, సిరా పోసుకునే ఫిల్లరూ–అన్నీ ఉన్నాయి. ఆనంద మైపోయింది.

కుర్రాళ్ళే సిరా పోసి తెచ్చారు. 'శ్రీరాములు' చుట్టారు. వాళ్ళ వాళ్ళ సంతకాలు సరదాతీరా అందరూ చేశారు. ఆఖరున నా కిచ్చారు. నేను కలం చూచుకుని మురిసిపోయా. అంతా బాగానే వుంది. కాని, దీనిని ఇంటికి తీసుకెళితే మావాళ్ళు చెమడాలు ఎక్కగొడతారు. ఏమిటి చేసేది ?— నాకు ప్రాణస్నేహితుడైనవాడు నారాయణరావు. నా కలం వాడిదగ్గర దాచపెట్టాను. ఎప్పుడు నే నడిగితే వాడు నాకు ఇచ్చేవాడు. నేను కాస్సేపు రాసుకొని, సరదా తీరగానే మళ్ళీ వాడిచేతికి ఇచ్చి దాచపెట్టేవాణ్ణి.

ఐతే, కొన్నాళ్ళయేప్పటికి నారాయణరావు, నే నడిగినప్పుడల్లా నాకు కలం ఇవ్వటం మానేసి, విసుక్కోసాగాడు. కొన్నాళ్లకల్లా మాకు జట్టు విడిపోయింది. అప్పుడు అసలే అడగటానికి వీలులేకపోయింది. ఏమీ ? మాటాడితే కంపెనీకి రాసిన సంగతి మా వాళ్లతో చెబుతానని నన్ను భయపెట్టేవాడు అతను. ఈవిధంగా, సరదాకోసం నేను తెప్పించుకొన్న ఫౌంటెన్ కలం నిష్కారణంగా నారాయణరావుకు ధారపోసుకోవలసి వచ్చింది !

—బి. వ్యాసశర్మ, ఖర్గపూర్

# వ్యాసరచన పోటీ—సమస్యలు

(బహుమతి పొందిన రచనలు)

ఒక రాజ్యం సుభిక్షంగా వుంటే, దానిని రామరాజ్యం అంటారు. రామరాజ్యం సాగాలంటే రామునివంటి ప్రభువు ఉండాలి.

ఇప్పుడు అడవిని పాలించటాన్ని గురించి— ఆవును తీసుకొందాం. ఆవు నిజానికి ఎంతటి సాధుజంతువు! అందుకనే కదా 'సత్యగోవు' అనే సామెత కూడా పుట్టింది? తను గడ్డిపరకలతో కాలక్షేపం చేసి మనకు మంచి పాలు యిస్తుంది. మృగరాజు అనబడే సింహమో!—దానివల్ల ఎవ్వరికీ ఎట్టి ఉపయోగమూ లేదు సరికదా, ఆకలి వేస్తే రంకెలు వేస్తూ పోయి, అరణ్యంలో వుండే జంతువులను హడలగొట్టి, ఏదో ఒక జంతువుమీద పడి, దానిని పొట్టన పెట్టుకుంటుంది. ఇదే మృగరాజువల్ల తక్కిన జంతువులకు కలిగే ఉపకారం! రక్షించేవాడు రాజుగాని, ఇలా భక్షించేవాడా రాజు? కనుక, సింహం కాకుండా, ఆవే మృగరాజుగా వుండటం అన్నివిధాలా క్షేమకరం.

—కె. మాణిక్యం, కడప

ప్రజను రక్షించేవాడు రాజు. ఐతే-రక్షించడమనే పని అనుకొన్నంత తేలిక కాదు. రాజ్యమేలే ప్రభువుకు కొన్ని లక్షణాలు ఉండాలి. అప్పుడే పరిపాలన సవ్యంగా వుంటుంది.

అరణ్యరాజు సింహానికి గల హుందా, గాంభీర్యం ఏమని చెప్పేది? అది నిజంగా సుగుణాల ఖని. ఆకలి వేస్తే తప్ప, అది అనవసరంగా విలాసానికి ఏ జంతువునూ చంపదు. ఇది ఎంతటి ఔదార్యం! కాని, సింహమే అరణ్యంలో లేకుంటె, తక్కిన జంతువులన్నీ నామరూపాలు లేకుండా పోతవే? వేటగాండ్రు సులువుగా వచ్చి, జంతుజాలాన్నంతటినీ నాశనం చేస్తారే! కనుక, నిజమైన రాచలక్షణాలుండబట్టే సింహం మృగరాజయింది.

అదీగాక—ఆవు మంచిదీ, ఉపయోగమైందే కావొచ్చు. ఆవులోనూ మేకలోనూ గాంభీర్యం వున్నది. లేదనలేము. కాని, అది అవసరాన్నిబట్టి తెచ్చిపెట్టుకొన్నదే కాని, స్వభావసిద్ధమైంది కాదు. కాబట్టి ఆవు ఎంతమాత్రమూ పరిపాలనకు పనికిరాదు.

—వి. సుభద్ర, కాకినాడ

# పదింట్లో పదకొండు

మనకు అనేకమైన పనులుంటాయి. ఒకొక్కప్పుడు మరొక పని అదనంగా చేయవలసి వస్తుంది. ఎన్నెన్నో ఖర్చులుంటాయి. ఒకొక్కప్పుడు ఇంకొక ఖర్చు పైగా తగలవచ్చు. ఇలాంటి సందర్భంలో 'కానియ్యండి—పదింట్లో పదకొండు' అనే సామెతను వాడుక చేస్తూవుంటాం. ఇది ఎలా పుట్టింది?—వినండి:

అన్నగారైన రావణాసురుడికి విభీషణుడు ఎన్నో నీతులు చెప్పి, ధర్మోపదేశాలు చేశాడు. ఇవేవీ రావణుడికి చెవికెక్కలేదు. అయినా, పట్టుదలతో విభీషణుడు ఇంకా చెప్పబోయేసరికి రావణుడు ఉగ్రుడయ్యాడు. చేసేది లేక 'పోనీ, నీ ఖర్మం' అని చెప్పి అన్నను వదిలేసి విభీషణుడు రాముడి వద్దకు పోయి శరణు జొచ్చాడు.

అప్పుడు శ్రీరాముడిచుట్టూ పరివారమంతా కూర్చునివున్నారు. 'ఏమి చేద్దాం?' అన్నట్టుగా రాముడు ప్రశ్నార్థకమైన చూపు చూచాడు. అప్పుడు అక్కడి పెద్దలంతా చర్చింపసాగారు.

'వీడు విరోధి తమ్ముడు. దగ్గరకు చేరనివ్వకూడదు, పొమ్మనండి' అన్నాడు లక్ష్మణస్వామి.

"రాక్షస మాయలు అనేక విధాలు! ఇది బాగా ఆలోచింపవలసిన విషయం. ఎంతమాత్రం తొందర పడకూడదు" అన్నాడు సుగ్రీవుడు.

"మనవాళ్ళలో ఒకణ్ణి ఎదురుపంపి నిజం తెలుసుకుని మరీ నిశ్చయించాలి" అన్నాడు మరొక వానరుడు. అందుమీదట హనుమంతుడు అందుకొన్నాడు: "రాయబారిని పంపినా, అవతలివాడు ఇంగితం ఎరిగినవాడై వుండాలి. వెనుక నేను సీతాదేవిని వెతకడానికి వెళ్ళినప్పుడు ఈ విభీషణుడి సంగతి కనిపెట్టాను. ఇతడు రాక్షస కులంలో తప్పబుట్టాడు. నిష్కపటి, నీతిమంతుడు. మనదగ్గరికి చేరనిస్తే వచ్చే ప్రమాదం ఏమీలేదు. ఒకవేళ అతను ద్రోహమే తలపెడతాడని అనుకొందాం. రావణాసురుడి పదితలలూ తెగవేయగలిగిన మీకు విభీషణుడి ఒక్క బుర్ర అనగా ఏపాటి? ఆ పదింటిలో ఇది పదకొండోది" అని సమాధానం చెప్పాడు హనుమంతుడు.

శరణాగతరక్షకుడైన శ్రీరామునికి హనుమంతుని పలుకులు నచ్చినై. అలాగేనని వెంటనే విభీషణుడికి శరణు యిచ్చాడు.

నాటినుంచీ 'పదింట్లో పదకొండు' అనే ఈ సామెత వాడుకలోకి వచ్చిందని చెబుతారు.



# పంచాయుధుడు

పూర్వం, బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పరిపాలించే కాలంలో, బోధిసత్వుడు యువరాజుగా జన్మించాడు. నామకరణమహోత్సవమునాడు దేశదేశాలనుండి దైవజ్ఞులు వచ్చారు. 'ఈ పసివాడు చాలా గొప్ప జాతకుడు. ఐదు ఆయుధాలతో ప్రపంచమంతటినీ జయించగల పరాక్రమశాలి' అని వారు జోస్యం చెప్పి, 'పంచాయుధు'డని పిల్లవానికి పేరుపెట్టారు.

పిల్లవానికి ప్రాజ్ఞత రాగానే గాంధర్వదేశంలోని 'తక్షశిలా' నగరంలో మహాపండితులైన గురువులవద్ద సమస్తమైన విద్యలూ నేర్చుకోవటానికని వెళ్లాడు.

పంచాయుధుడు తక్షశిల వెళ్ళి చదువుకొని, సకలవిద్యాపారంగతుడయ్యాడు. ఆశ్రమంనుండి సెలవు తీసుకొనేటప్పుడు గురువు శిష్యుణ్ణి దీవిస్తూ ఐదు ఆయుధాలు ప్రసాదించాడు. గురువుగారి అనుజ్ఞతో కాశీరాజ్యానికి బయలుదేరాడు పంచాయుధుడు. దారిలో ఒక మహారణ్యం దాటవలసి వచ్చింది. రాజకుమారుడు అలా పోతూ వుండగా, కొందరు మనుష్యులు అడ్డుపడి, 'ఓయీ పిన్నవాడా—తెలుసునో లేదో, ఈ మహారణ్యంలో రోమాంచుడనే రక్కసుడు విహరిస్తూవుంటాడు. వాడి కంటబడితివో నీపని సరి అన్నమాటే. కనుక, ఈ దారి మానివేసి మరిఒక దారిని తప్పించుకపోయి, అరణ్యం దాటిపో. ప్రాణాలు దక్కించుకో' అంటూ సలహా చెప్పారు.

ఈ మాటలేవీ పరాక్రమవంతుడైన పంచాయుధుని చెవికి ఎక్కలేదు. సరాసరి ముందుకు పోయి, నట్టడవిలో చొరబడ్డాడు. కొంతదూరంలో తాటిచెట్టంతఎత్తు రాక్షసుడు రోమాంచుడనేవాడు ప్రత్యక్షమయ్యాడు! బ్రహ్మాండమైన తల—చెంబులంతేసి కన్నులు—ఏనుగునకు మోస్తరుగా, నోటి




లోపలినుండి రెండు దంతాలు—వంటినిండా ఎలుగుబంటి రోమాలు—రంగురంగులతో భయం కొలుపుతూ ఉన్నాడు వాడు !!

"ఎవడవురా నీవు? ఎక్కడికి పోతావు? నిలు, నిలు, నిన్ను మింగుతా!" అని హుంకరించాడు రాజకుమారుని చూచి.

అందుకు పంచాయుధుడు "రాక్షస రాజా!-తెలిసే, నేనీ అరణ్యం ప్రవేశించాను. నువు నా చేరువకు రాబోకుమా. ఇదుగో ఈ అమ్ముతో నిన్ను నిలబడ్డపాటున పడ గొట్టుతాను. చూచుకో..." అంటూ, బాణం ఎక్కుపెట్టి కొట్టాడు. అదిపోయి రాక్షసుడు ధరించిన 'కంచుకా'నికి తగిలిందేకాని, వానినిమాత్రం ఏమీ చేయలేకపోయింది. పౌరుషంకొద్దీ పంచాయుధుడు ఇంకొక బాణం మళ్లీ వేశాడు. అదీ మొదటిదాని లాగే కంచుకానికి తగిలి మణిగిపోయింది. ప్రచండవేగంతో రాజపుత్రుడు మరికొన్ని బాణాలు వరసన వదిలాడు. ప్రయోజనం లేకపోయింది. యాభై బాణాలు—విషపూరిత మైనవి వేశాడు. లాభం కనిపించలేదు!

అఖరున రోమాంచుడు తన ఒంటిమీద ఉన్న కంచుకాన్ని అట్టె దులిపివేశాడు. ఇప్పటివరకూ కంచుకానికి తగిలిన బాణాలు అన్నీ వాని కాళ్లపైన రాలి పడినై. వాడు బోధిసత్వునికి ఎదురుగా వెళ్ళాడు. బోధిసత్వుడు తన ఖడ్గం దూసి, రాక్షసుడి పైకి విసిరాడు.

ఆ గొప్ప ఖడ్గంకూడా బాణాలలాగానే పోయి రాక్షసుడి కంచుకంలో గుచ్చుకు పోయింది! ఆమీద రాజకుమారుడు తన గదను వానిపైకి విసిరాడు. అదిపోయి, వాడి కంచుకానికి అంటుకపోయింది. ఇంకా ఎన్నో ఆయుధాలను ప్రయోగించాడు. వాటి పనీ అంతే ఐంది!

అప్పుడు బోధిసత్వుడు 'ఓయీ రాక్షసుడా!—నే నెవరినో ఎరుగవుకాబోలు. నా పేరు పంచాయుధుడు. నేను ఈ అరణ్యా

నికి బయలుదేరేటప్పుడు నా ఆయుధాలను నమ్ముకోలేదుసుమా; నా శక్తినే నేను ఆధారంచేసుకొని వచ్చాను! ఇక చూచుకో నాబలం. దెబ్బతో కూలిపోతావు!!' అంటూ, కుడిచెయ్యి పిడికిలిపట్టి రోమాంచుడికి బలంకొద్దీ ఒక్క గుద్దు ఇచ్చాడు. ఆ చెయ్యి రాక్షసుడి రోమాలలో ఇరుక్కుపోయింది !!

ఊరుకోలేదు రాజకుమారుడు. ఎడమ చేతితోనూ కాళ్ళతోనూ పడపడమని గుద్దులిచ్చాడు. ఆ చెయ్యీ, కాళ్ళూకూడా రాక్షసుడి రోమాలలో చిక్కుకుపోయినై. కాలు చేతులు ఆడక, ఏమీ చేయలేకపోయాడు పంచాయుధుడు. ఐనా, పౌరుషంమట్టుకు చావలేదు. 'చూచుకోరా, దుర్మార్గుడా!' అని గర్జిస్తూ, తలతో కొట్టనారంభించాడు. అయ్యో, పాపం!—వాని తలకూడా రాక్షసుడి రోమాలలో అతుక్కుపోయింది !!

ఇంత జరిగినా, బోధిసత్త్వుడికి నిబ్బరం సడలలేదు. పిన్నవాడిని చూచి రోమాంచుడు 'వీడెవడో సామాన్య మానవుడు కాదు. సింగపుకొదమలాగా కనిపిస్తున్నాడు. నన్నే డీకొనటానికి సాహసించిన ఈ బుడుతడి ధైర్యం ఎంతటిదో కదా! ఇంతవరకూ నా జన్మలో నేను ఇటువంటి నరుణ్ణి చూచి ఎరుగను' అని తలిచి ఆశ్చర్యపోయాడు.




'పిన్నవాడా!—మీ మానవులు నా స్వరూపం చూచినంతటనే హడిలిపోతారే? నీకు ప్రాణభయం లేకపోవటానికి ఏమిటి కారణం?' అని అడిగాడు.

బదులుగా బోధిసత్త్వుడు—'ఎందుకు భయం? పుట్టుక ఎప్పుడున్నదో చావూ అప్పుడే వుంది. అదీగాక—నా శరీరంలోపల వజ్రసదృశమైనటువంటి ఖడ్గమొకటి వున్నది. అదే 'జ్ఞానం'. నన్ను నీవు మింగటమే జరిగితే, అది నీ కడుపులో ప్రవేశించి, నిన్నూ సంహరిస్తుంది' అన్నాడు.

ఈ మాటలు వినగానే రోమాంచుడు మళ్ళీ ఇలా అనుకొన్నాడు: 'ఈ పసివాడు

చెప్పే మాటలన్నీ పరమసత్యాలే. ఇటు వంటి శూరశిఖామణిని పొట్టను బెట్టుకొన టమేకాని, హరాయించుకోవటానికి శక్యం కాదు. కనుక, వదిలేస్తా.'

తరువాత రాజకుమారునితో 'పసివాడా! నిన్ను నేను తినదలుచుకోలేదు. నువు స్వేచ్ఛగా వెళ్లిపో' అన్నాడు.

'ఓయి రాక్షసుడా! సరే. నన్ను వదిలి పెట్టావు బాగానే వుంది. నేను వెళతాననుకో. నీమాట ఏమిటి? ఎన్ని జన్మలో ఎత్తి ఎత్తి, నీవు దుర్మార్గపు పనులు చేస్తూ ఇలా నికృష్టపు బతుకు బతుకుతున్నావు. అజ్ఞాన మనే అంధకారంలో కొట్టుకొంటున్నావు. ఎంత కాలమున్నా నీ గతి ఇంతే.

'ఐతే—నీవు ఇలానే ఉండిపోవటానికి వీలులేదు. నిష్కారణంగా మానవులను చంపి తింటున్నావంటే, నీ పాపం అంతు లేకుండా పెరిగిపోతున్న దన్నమాట. పాపం పెరిగినకొద్దీ నీవు రాక్షసిజన్మలే ఎత్తి, యాతనలు అనుభవిస్తూ ఉండటమేకాని, ఎన్నటికీ నీకు మోక్షం లేదు. కనుక, నీకు ఉత్తమమైన మానవజన్మ కావాలంటే పాపంచేయకు' అని హితవు చెప్పాడు.

అంతే కాదు. మానవులు మేలు పొంద టానికి విధింపబడిన ఐదు మహాసూత్రా లనుగురించీ, మానవుణ్ణి అధముడుగా చేసే పంచ తంత్రాలను గురించీ విప్పి చెప్పి, బోధిసత్వుడు రాక్షసుడి మనస్సు మార్చివేశాడు.

నాటినుంచీ, రోమాంచుడు తన రాక్షస కృత్యాలు మానివేశాడు. ప్రజోపకారక మయిన ఘనకార్యాలు నిర్వహించి, గొప్ప పేరు తెచ్చుకున్నాడు. ఇప్పుడు ఆ అరణ్యం ప్రవేశించటానికి మానవు లెవళ్ళకూ భయం లేకుండా పోయింది.

అంతేకాదు. మనసు మారిన రోమాంచుడి ఆతిథ్యం పొందటానికి అందరూ కుతూహలపడతారుకూడా.






పూర్వకాలమందు ఒకప్పుడు, కేరళ దేశంలో ఒక బ్రాహ్మణుడు ఉండేవాడు. అతను కడుపేద. ఊరూపేరూ లేనివాడు. ఐతే, పరమభక్తుడు. తనకు ఇష్టదైవమైన విష్ణుమూర్తి అనుజ్ఞప్రకారం అతడు ఒక గ్రంథం రచించాడు. ఆవేశంతో రచించిన ఆ గ్రంథాన్ని తీసుకపోయి, అతడు ఆనాటి మహాపండితులకూ విద్వాంసులకూ చూపించాడు. చూపించి, వారి అభిప్రాయం తెలుపమని కోరాడు.

దానిని చూచిన ప్రతిఒకరూ 'ఇదేమి రాతయ్యా, బ్రహ్మలిపి? ఇదేమి భాషా, దేవభాష?' అంటూ గేలిచేయసాగారు. ఆ బ్రాహ్మడికి ఈ మాటలు వినగానే విరక్తి కలిగింది. అందుచేత గ్రంథం చంకన పెట్టుకొని, యాత్రకని బయలుదేరాడు.

కొన్నాళ్లకల్లా అతడు ఒక మహారణ్యం చేరుకొన్నాడు. ఎటు పోవటానికీ అడుగు ముందుకు పడలేదు. పైగా, అలసిపోయి వుండటంవల్ల ఒక చెట్టునీడని అంగవస్త్రం పరుచుకొని, దైవధ్యానం చేసుకొంటూ పడుకొన్నాడు. పడుకొన్నాడేకాని, అతనికి నిద్ర పట్టిందికాదు.

అర్ధరాత్రిసమయాన ఒక సన్యాసి ఎదట కనిపించి, బ్రాహ్మణ్ణి కుశలప్రశ్నలు వేశాడు. బ్రాహ్మడు తన చరిత్ర అంతా పూస గుచ్చినట్టు విప్పిచెప్పి, కష్టపడి రాసిన తన గ్రంథ ఆయనకు చూపించాడు.

సన్యాసి అతని చరిత్ర విని జాలి చెంది, 'ఓయీ బ్రాహ్మడా!—శివరాత్రినాడు బయలుదేరి నువు తిన్నగా గోకర్ణక్షేత్రం వెళ్లు. అక్కడ తూర్పుదిశనుండే గోపురం వద్ద కనిపెట్టుకొనివుండు. ఏం జరుగుతుందో చూడు. ఐతే, ఏమి జరిగేదీమట్టుకు పిట్టకైనా తెలియనీయకూడదుసుమా!' అంటూ హెచ్చరించి అదృశ్యమయ్యాడు.

కె. వి. రాజవర్మ



అప్రకారం బ్రాహ్మడు గోకర్ణక్షేత్రం చేరుకొన్నాడు. 'తూర్పు గోపురం'వద్ద నిరీక్షిస్తూ వుండగా, సూర్యాస్తమయమయ్యేసరికి ఒక వృద్ధబ్రాహ్మడు, నాలుగు కుక్కలను వెంటబెట్టుకొని సరిగా అతనివద్దకే వచ్చి నిలబడ్డాడు. ఆ వృద్ధుని దర్శనం కాగానే పేదబ్రాహ్మడిలో చైతన్యం కలిగింది. అయనే తనకు తరణోపాయం చూపించగల మహానుభావుడని మనస్సులో తోచింది. వెంటనే పాదాక్రాంతుడై, అతడు తన గ్రంథం వృద్ధునికి సమర్పించాడు.

వృద్ధుడు చిరునవ్వు నవ్వుతూ, 'నీవు కష్టపడి వ్రాసిన ఈ గ్రంథానికి లోకంలో మంచి వ్యాప్తి కలుగుతుంది. దిగులు పడకు. ఐతే, నువ్వు నన్నే ఎందుకు ఆశ్రయించావు? ఇలా చేయమని నీకు ఎవరు సలహాచెప్పారు?' అని అడిగాడు. అందుకు పేదబ్రాహ్మడు 'మహాత్మా!—ఈ రహస్యం నేను వెల్లడించనని మాట ఇచ్చాను. కనుక మన్నించాలి'' అన్నాడు.

వృద్ధుడు బ్రాహ్మడి సత్యసంధతకు మెచ్చుకొని, 'సరే. అదంతా నాకు తెలుసులే. నీకు ఈ సలహా చెప్పినఅతడు గంధర్వుడు. ఇలా దేవరహస్యం వెల్లడించినందుకుగాను అతనికి శాపం తగలనే తగిలింది. ఆ శాపానికి ఫలితంగా అతను భూలోకమందు జన్మించి, లోకోపకారార్థం, నీ గ్రంథానికి అతనే అమరత్వం కలిగిస్తాడు' అని చెప్పి మాయమయ్యాడు. ఈ వృద్ధుడే వేదవ్యాసుడు. అయన వెంటనున్న నాలుగు కుక్కలూ నాలుగు వేదాలు.

వేదవ్యాసుడు ఇలా చెప్పిన కొద్దికాలానికే పేదబ్రాహ్మడు కాలంచేశాడు. అతని చేతిలోని గ్రంథం నదిలో కొట్టుకొనివచ్చి, 'చంపకేసరి' రాజుకు చేరింది. ఆ రాజు గ్రంథం అటు యిటు తిప్పిచూచాడు. ఏమీ బోధపడలేదు. అస్థానపండితునికిచ్చి, 'నేటినుండి నలభైఒక్క రోజులలోపల ఈ

గ్రంథంలో విషయం ఏమిటో మాకు విశదం చేయాలి. లేకుంటే తల తీయించివేస్తాము' అని అజ్ఞాపించాడు. పండితుడు గొప్ప చిక్కులో పడాడు.

అప్పుడు ఆయన ప్రియశిష్యులలో ఒకడైన రామానుజుడు గురువుగారు విచారంగా ఉండటం కని పెట్టి, కారణం ఏమిటో చెప్ప మన్నాడు. గురువు ఎంతకూ చెప్పలేదు. చూడబోతే రాజు ఇచ్చిన గడువుకు ఇంకొక్క రోజే వున్నది.

కనుక, చెప్పక తప్పింది కాదు. అప్పుడు రామానుజుడు 'మీరేం భయపడకండి గురువుగారూ!' అన్నాడు. శిష్యుని కోరికప్రకారం ఆ రాత్రి పూజకు ఏర్పాటు చేశాడు గురువు. ఆపూజలో తను తప్ప ఎవ్వరూ ఉండకూడదని కచ్చితంగా చెప్పాడు రామానుజుడు.

అర్ధరాత్రి సమయం. గొప్పగా పూజ జరుగుతున్నది. అయితే, ఆత్రంతో వున్న గురువుగారు శిష్యుడికి తెలియకుండా, అటకమీద దాంగొని ఏం జరుగుతుందోనని తొంగి చూస్తూవున్నాడు. రామానుజుడు చేస్తున్న పూజకు ఫలితంగా, అరుగురు దివ్యపురుషులు వచ్చి పూజామందిరంలో కూర్చొని మహాగ్రంథం రచిస్తున్నారు.



ఈ దృశ్యం చూసి ఆశ్చర్యం పొందిన గురువుగారు తట్టుకోలేక, అటకమీదినుంచి కింద పడ్డాడు. ఆయన అవస్థచూచి, శిష్యుడు రామానుజం 'అయ్యో, ఎంత పని చేశారు గురువుగారూ!' అని నొచ్చుకొని, వెంటనే పరిచర్యలు జరిపి, దెబ్బలు నయంచేశాడు.

రాజు పెట్టిన గడువు దాటకముందే ఆ గ్రంథం చక్కటి లిపిలో తయారయింది. రాజు పండితుణ్ణి ఎంతో మెచ్చుకొని ఘనంగా సన్మానించాడు. ఈ మహాగ్రంథమే మళయాళభాషలో వ్యాప్తిచెందిన 'అధ్యాత్మరామాయణం.' రామానుజుడే శాపం పొందిన ఆ గంధర్వుడు.

# ముగ్గురు నేస్తాలు (రంగులబొమ్మ కథ) - 4

అందుకు కురపన్న 'అమ్మా !—కోతి, చిలుకా అల్లరి చేసిపోయినైకాని, కోవిల నేస్తంమట్టుకు అలా చెయ్యదమ్మా !!' అన్నాడు. 'సరే ఐతే. ఈ కోవిలనేస్తం కూడా నిన్ను అల్లరిపెట్టిందో, నువ్వింక ఎవళ్లతోనూ నేస్తం కట్టటానికే వీలులేదు. ఒక్కడివీ ఉండవలసిందే. తెలిసిందా ?' అంటూ హెచ్చరికచేసింది, వాళ్లమ్మ.

అనుకొన్నట్టుగానే, మరునాడు మళ్ళీ కోవిలనేస్తం కురపన్న గుడిసెకు వచ్చి చేరుకొంది. ఇంకా అప్పటికి వర్షం కురుస్తూనేవుంది. ఆ చలిచేత కుర పన్నకు ఏపని చేయటానికీ బుద్ధి పుట్టలేదు. కాని, చూడగా చేతినిండా బోలె డంత పని కనిపిస్తున్నదాయె.

కురపన్న చీకాకుగా వుండటం కనిపెట్టింది వచ్చిన కోవిలనేస్తం. మెల్లగా చల్లగా, వాడి బుజంమీద వాలింది. కురపన్న, వాడి జన్మలో విననటువంటి తియ్యటి పాటలు—తన్మయం కలిగించే పాటలు–చెవిలో పాడి వినిపించింది ! చెట్లు, చేమలు–గట్లు, పుట్టలు–ప్రవహించే నదులు–గాలిలో నాట్యంచేసే పుష్ప జాతులు—పువ్వుపువ్వుకీ ఎగిరే రంగురంగుల సీతాకోకచిలుకలు–వీటన్నిటిని గురించీ చక్కటి పాటలు కట్టి, ఎంతో రక్తిగా పాడింది.

అంతే కాదు. అడవిలో జంతువులనుగురించిన వింతకథలుకూడా పాడింది. ఈ పాటల సందడిలో కురపన్న తనకు తెలియకుండానే చేతిలో పని అంతా ముగించివేశాడు. ఆ సంతోషంలో ఎప్పుడు సాయంత్రం కావచ్చిందో కూడా వాడికి తెలియనేలేదు. వాళ్ళమ్మా నాన్నా యింటికి రావటంతో పొద్దు పోయినట్టు కురపన్న గ్రహించాడు.

పెద్దవాళ్ళు కోవిల సంగతి విని చాలా ఉత్సాహపడ్డారు. 'ఈనాటికి నువ్వు నిజమైన నేస్తాన్ని పట్టావురా నాయనా !' అన్నది వాళ్ళమ్మ. అందుకు వాడు, 'అవును. మనం చేసినట్టు చేస్తుంది కోతినేస్తం. మనం చెప్పినట్టు పలుకు తుంది చిలుకనేస్తం. కాని, కోవిల అలా కాదు. స్వంతంగా తీయటి పాటలు పాడి, అది తన ఆటపాటలతోనే మనుషులచేత ఎంత పనిఐనా చేయించగలదు ! అందుకనే అది నాకు నిజమైన నేస్తం !!!' అన్నాడు, కురపన్న. ★




# దేవుడితో . . . . . . చదరంగం

పూర్వం ఒకానొకప్పుడు ఒక స్వాముల వారుండేవారు. ఆయన గొప్ప పండితుడని పేరు పొందాడు. ఆయనకు దేశమంతటా శిష్యగణం ఉండేది. వారంతా స్వామి దర్శనంకోసం తహతహలాడేవారు.

స్వామి ఒక్క ఆరునెలలు మాత్రమే తన ఆశ్రమంలో వుండి శిష్యులకు వేదవేదాంగ రహస్యాలు అన్నీ విప్పిచెబుతూ, తక్కిన ఆరు నెలలూ దేశాటన చేసేవారు. సంచారం సాగించే సమయంలో శిష్యులు భక్తితో సమర్పించే తృణమో పణమో స్వీకరించి, లభించినదానితో తృప్తిపడేవారు.

ఇలా స్వామివారు దేశాటన చేసుకొంటూ, ఒకప్పుడు పల్లెప్రాంతంలో వుండే శిష్యుల వద్దకు వెళ్లడం తటస్థించింది. స్వామి అలంత దూరాన ఉండగానే, ఈ వార్త వాడ వాడలా అల్లుకొన్నది. శిష్యబృందం అంతా చేరి, మంగళతూర్యారావాలతో స్వామిని ఎదుర్కొని గ్రామంలోకి తీసుకవచ్చారు. విష్ణు ఆలయపు ఆవరణలో వుండే ఒక మండపంలో వారికి బస ఏర్పాటుచేశారు.

గ్రామంలో స్వామి అడుగుపెట్టింది మొదలుకొని, ఇక ఆ సందడి చెప్పతరమే కాదన్నమాట! భజనలతో, కాలక్షేపాలతో, పురాణపఠనాలతో కాలం సద్వినియోగం ఐనందుకు గ్రామస్థులు ఆనందించి, ధన్యులమయ్యామని అనుకొన్నారు.

ఆ గ్రామస్థులను తరింపజేసిన వెంటనే స్వామి మరిఒక గ్రామానికి మకాం మార్చటానికి యత్నపడుతున్నారు. శిష్యుల నందరినీ సంతోషపెట్టాలెకదా, మరి? ఇంకొక్క గంటసేపటిలో బయలుదేరతారనగా,

పి. రంగనాయకమ్మ




స్వామి తన బసలో ఏదో ఆలోచిస్తూ అటు యిటు పచార్లు చేయసాగారు.

అలా పచార్లుచేస్తున్న స్వామికి ఎదట అడవిలో ఒక మనిషి చేసే వింత చేష్టలు ఆశ్చర్యం కలిగించినై.

'వీడెవడురా అబ్బా, ఒకవేళ పిచ్చివాడు కాదుకదా!' అనుకొన్నాడు స్వామి తన మనస్సులో. పరకాయించి చూస్తే, ఆ దుస్తులూ వాడూ, ఒక సంపన్న గృహస్థు లాగా కనిపించాడు.

ఈ చిత్ర మేమిటో కనుక్కోవాలనే నిశ్చయంతో, స్వామి పాదచారిగానే బయలుదేరి అతనిదగ్గరకు వెళ్లాడు. స్వామి అలారావటం ఏమీ గమనించనేలేనట్టుగా వాడు తనలో తనే మాటాడుకొంటూ, కాళ్ళూ చేతులూ వింతగా ఊపుతూవున్నాడు.

'అబ్బాయీ!—ఏమిటిదంతా? నువ్వు ఇక్కడ ఎవరితో మాటాడేది?' అని స్వామి ప్రశ్నించాడు.

'మాట కాదు, ఆట. ఆటాడుతున్నాను. నేనెవరితో ఆడుతున్నానో, బహుశా వారు మీకు కనబడరేమో!' అని బదులుచెప్పాడు ఆ కొత్తమనిషి.

విస్మయం పొందాడు స్వామి. "వీడు పిచ్చివాడా!" అని మళ్ళీ ఒకసారి సంశయం కలిగింది ఆయనకు.

'అబ్బాయ్!—నువ్వాడే ఆట యేమిటి? నీతో ఆడే ఆ అవతలివారెవరు?—నాకు చెప్పవచ్చా?' అని అడిగాడు స్వామి.

'అదే ఉన్న రహస్యమల్లా! ఐనా లోక కల్యాణంకోసం అవతరించిన మహానుభావులు మీరు. మీకు వెల్లడిచేయటానికి అభ్యంతరమేముంది? నేను ఆడే ఆట చదరంగం. నాతో ఆడే అవతలివాడు కేవలమూ ఆ దేవుడే!' అని చెప్పాడు తొణుకూ బెణుకూ లేకుండా, ఆ వింతమనిషి.

స్వామికి పొట్ట చెక్కలయ్యేలా నవ్వు వచ్చింది. 'వీడెవడో నిజంగా పిచ్చివాడే.

కాని ఆ పిచ్చిలోనూ ఒక తెలివి, పద్ధతి కనబడుతున్నది' అనుకొన్నాడు.

అప్పుడు స్వామి 'ఐతే గెలుపెవరిది?' అని మళ్ళీ అడిగాడు.

"ఉండండి, ఉండండి! ఇంకా ఆట పూర్తి కాలేదు," అని అతను చెట్టుమీదికి చూస్తూ "మీరన్న 'రాజూ ఆటకట్టు!' అన్న మాట విన్నాను దేవా! ఇవాళ గెలుపు మీదే" అంటూ, జేబులో చెయ్యిపెట్టాడు.

ఈ చర్య స్వామికి మరింత వింత కొలిపింది. 'మరి, గెలిచినవాళ్లకు ఓడినవాళ్లు ఏమైనా ఇచ్చుకోవాలా?' అని ప్రశ్న వేశాడు.

'లేకేమి స్వామీ!—ఆటకు రెండు మొహిరీలు చొప్పున పందెం' అని చెప్పాడు, ఆ కొత్తమనిషి.

'ఐతే—ఇప్పుడు నువు ఓడిపోయావుకదా మరి, దేవుడికి రెండు మొహిరీలూ చెల్లించ లేదేం?' అని తమాషాకు అడిగాడు స్వామి.

అడగటమే తడవుగా అతను గభీమని జేబులోనించి రెండు మొహిరీలు తీసి—'దేవుడు ఎప్పుడూ తన పందెండబ్బు నా దగ్గరనుండి స్వయంగా తీసుకోరు. ఆ సమయానికి ఏ భాగవతోత్తముని రూపంలోనో వచ్చి ప్రత్యక్షమవుతారు. వారికి ఇస్తే దేవుడికి చెందుతుంది ఆ ధనం. ఇవాళ



అదృష్టవశాన మీరు వచ్చారు. కనుక, దయ చేసి ఈ మొహిరీలు రెండూ, తమరు పుచ్చుకొన్నారంటే ఆదేవుడికి అందేస్తుంది' అంటూ, ధగధగ మెరిసే రెండు నాణాలు స్వామి చేతిలో పెట్టాడు.

ఆ నిమిషాన ఏంచేదామన్నా స్వామికి పాలుపోయిందికాదు. వెంటనే బసకు మరలి పోయి, పిచ్చివాళ్లలోకూడా ఎంతటి గొప్ప భక్తులున్నారో తన శిష్యబృందానికి ఆయన తెలియజెప్పాడు.

రెండు నెలల తరువాత—

స్వామివారు కొంతవరకు దేశసంచారం చేసి, శిష్యకోటిని తరింపజేస్తూ, వారిచ్చిన

కట్నాలూ కానుకలూ మూటకట్టుకొని, ఇంటి ముఖం పట్టారు. తిరుగుదలలో వారు మళ్లీ ఇదే గ్రామం రావడం తటస్థించింది.

ఊరిలో దిగుతూనే, స్వామికి వెనుకటి వింతమనిషి సంగతి గుర్తుకు వచ్చింది. మళ్లీ అడవిలో ఆ ప్రాంతంలో చూస్తే, ఆ పిచ్చి వాడు ఎప్పటిచోటనే కనిపించాడు. వెంటనే కుతూహలంకొద్దీ స్వామి అతనివద్దకు వెళ్లి,

'అబ్బాయ్!—ఇవాళ ఎవరిది గెలుపు?' అని వినోదంగా ప్రశ్నవేశారు.

ఆడుతూ ఆడుతూవున్న అతను అట్టె ఒకమారు మునపటిలాగానే చెట్టుపైకి చూశాడు. 'రాజా—ఆటకట్టు!!' అని పెద్దగా అరిచి, పకపక నవ్వాడు.

'ఏమిటోయ్ ఖులాసా? చూడగా ఇవాళ నువ్వే గెలిచినట్టుందే!' అన్నాడు స్వామి.

'గెలిచాను స్వామీ, గెలిచాను మీ చలవ వల్ల. అదృష్టం యేమిటోకాని ఈసారి పందెంకూడా ఘనమయిందే! వంద మొహి రీలు!!' అని చెప్పి, మళ్లీ పకపక నవ్వాడు.

'ఐతే—దేవుడు ఆ డబ్బు నీకు ఏవిధంగా చెల్లిస్తాడు?' అని అడిగాడు స్వామి, పొంగి పొరలే నవ్వు అపుకొంటూ.

'దేవుడు ఎన్నడూ నాకు స్వయంగా డబ్బు చెల్లించడు. ఆ సమయానికి ఏ పరమ భాగవతోత్తముని రూపంలోనో సాక్షాత్క రించి, నాకు అందజేస్తాడు. ఇవాళ అదృష్ట వశాన తమరు దర్శనమిచ్చారు, సమయా నికి' అన్నాడు వాడు.

ఈ మాట అర్థం గాక తెల్లబోయి చూస్తున్నాడు స్వామి. 'తమరు నాకు చెల్లించివేస్తే, దేవుడి బాకీ తీరిపోతుంది!' అంటూ ఆ మోసకాడు పక్క పొదలో వుంచిన దుడ్డుకర్ర బయటికి తీశాడు.

స్వామి బిత్తరపోతూ, సంచారంలో శిష్యకోటి తనకు సమర్పించిన సమస్తమూ వాడికి సమర్పించుకొని, ఉత్తచేతులతో ఇంటికి దారితీశాడు!



## ఫోటోవ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 10 లు

1954 జూన్ సంచికలో ప్రకటింపబడే ఫోటోలకు నమూనాలు





★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.

★ ఏప్రిల్ 7-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 10/-లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి:–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26.

## మే నెల చందమామలో

ప్రచురింపబడే ఫోటోలకుగాను, ఈ దిగువ ఉత్తమవ్యాఖ్యలకు బహుమతి యివ్వడమైనది.

మొదటి ఫోటో: తలపు | రెండవ ఫోటో: పిలుపు

పంపినవారు: కాకుమాను రుద్రకుమార్, జానకిరాం బైండింగ్ వర్క్స్ - తెనాలి

**బహుమతిమొత్తం రూ. 10/- మేనెల సంచిక వెలువడినతరువాత పంపబడుతుంది.**

# మంగళహారతి




దిరిశనపూడీ
దేవాలయమున
రామాయణ కథ
కాలక్షేపం
రసోచితంబుగ
రాత్రులయందు
వినిపిస్తున్నా
డొక హరిదాసు.

....

స్వరమాధుర్యం
తరంగ శ్రవణం
చలోక్తు లెంతో
గ్రామస్థుల కతి
ఉల్లాసం బియ
ప్రొద్దుగ్రుంకులా
తీర్థం బటులా
ప్రోగగుచుందురు
హరికథకూ.

....

కథ చివరను బహు
గంతులతోడను
పవమాన సుతుని
పాటలతోనూ
కైంకర్యం, మరి
కానుల పళ్ళెం
పలువుర మధ్యలో
పట్టుక తిరుగా
భక్తి భావమున,
ప్రజ లొక్కుమ్మడి
కానుక లేయగ
పళ్ళెము నిండీ
బరువుగ నుండూ.

....

హరిదాసూ—తన
హంగుదారులూ
ఆనందంబుగ
గణించుకొంటూ
ఉండెడివారూ.

....

ఘరాన మానవు
డొక డిది గాంచీ
పూటా రూకను
పళ్ళెము నుంచీ
పూర్తిగ చిల్లర
కాజేస్తుండెను!

....

హరికథ బృందము
హొటలుకు పోయీ
సాంబా రిడ్లీ

వుప్మా దోసే
బాగా మెక్కి
బిల్లు కట్టగా
గల్లాపెట్టెకు
ముందు బల్లపై
చుక్కలలో గల
చంద్రుండో యన
చిల్లర డబ్బుల
మధ్యని గల యా
రూకను వినరెను
ఉల్లాసంబుగ.

....

కాఫీహెూటెలు
అయ్యరు వెంటనె
పూటారూపాయ్
పడదని చెప్పగ:
హరికథ బృందము
అమాయకంబుగ
'అదేమిటయ్యా!
భక్తు లొసంగిన
రూకను మీ కియ
చెల్ల దటంచూ
చెప్పేస్తుండవు,
సరిగా చూడుము
భగవదార్పణగు
భక్తుల కానుక
చెడుగని చెప్పగ
పనికిరాద'నుచు
పలికిరి వారలు!

....

'అది కాదయ్యా
హరిదాసయ్యా!
చేత నాణెములు
చేసెడివాడే
నిత్యం బీ విధి
నిశ్చయంబుగా
చేత నాణెమును
చల్లగ వుంచీ
చిల్లర కాస్తా
చేబడుతున్నటు
చెప్పక చెప్పుచు
ఉన్నవిలే మీ
ముఖకవళిక' లని
మోటుగ అయ్యరు
అంటించెను మరి!

...

పూటారూపా
యైతే మాత్రం
మన కొచ్చిన కొర
తేమిటి గానీ,
పడని రూపాయి
పళ్లెము నుంచీ
పదిహేనణాల
మూడు కాసులూ
దొడ్డగ దోపిడి
చేస్తున్నందుకు
శౌర్యం ప్రబలి,
దొంగను పట్టగ
ధోరణి మారిన
హరికథ కాస్తా
అభాసపాలగు,
అరికట్టే విధ
మెట్లా గంటూ
సతమతమవుతూ
ఉన్నాడల్లా
హరిదాసూ!

....

మారని నాణెము
మంగళహారతి
పళ్లెములో బడి
మారుచుండెగా!

—వల్లభనే



Printed by B. NAGI REDDI at the B. N. K. Press Ltd, Madras 26, and Published by him for Chandamama Publications, Madras 26, Controlling Editor SRI 'CHAKRAPANI'



బహుమతి పొందిన వ్యాఖ్య

పుట్ట విడిచి బుట్ట

పంపినవారు: కె. ఎస్. గుప్త - అనకాపల్లి




రంగులబొమ్మ కథ — 4 - వ బొమ్మ